శ్రీరస్తు

# శివకుమార నాటకము



గ్రంథకర్త:

గంగాధరయ్య

కథలాపురము.



పబ్లిషర్,

**బండా నారాయణ శ్రేష్ఠి**

**బుక్ సెల్లర్ & పబ్లిషర్**

**జనరల్ బజార్. సికింద్రాబాద్. (దక్షి)**

1949

వెల 1-0-0

శ్రీరస్తు.

శ్రీశివాయనమః।

శ్రీరాములు నీవేకలవు॥

# శివకుమారనాటకము.



గ్రంథకర్త:

గంగాధరయ్య

కథలాపురము.

కృతి చేయించినవారు,

శీలమంతుల ఛత్రయ్య

జాగీర్ పెదమెటుపల్లి.




పబ్లిషర్:

చందా నారాయణ శ్రేష్టి,

పుస్తకముల వ్యాపారము, జనరల్ బజార్, శికింద్రాబాద్.

శార్వరి బ॥ త్రయోదశి 1949/8/22అగష్టు.




వెల ఒక రూపాయి.

## ఈనాటకమునందు వచ్చు పాత్రల వివరములు,

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| సూత్రధారి | నటులు |
| ధర్మరాజు | ఆకాశవాణి |
| మంత్రి | సత్యావతి |
| సుజ్ఞాన మూర్తి | చెలికత్తె |
| సేవకుడు | గిరిజావతి |
| తాత కుమారుడు | చలికత్తె |
| దొంగ రాక్షసుడు | చెంచుస్త్రీలు |
| శివకుమారుడు | పద్మావతి |
| నారదుడు | సీలావతి |
| గరుడ పక్షులు | దొంగ రాక్షసి |
| పిల్లలు | చంద్రావతి |
| సిద్ధుడను మునీశ్వరుడు | పుణ్యావతి |
| పరమేశ్వరుడు | అక్కలు |
| ముంగిరాజు | |
| మంత్రి | |
| సర్పము | |
| ఆది శేషుడు | |
| మాయ రాక్షసుడు | |
| బ్రహ్మ విలోచనుడు | |
| రాక్షసులు. | |

శ్రీ ర స్తు.



శ్రీశివాయనమః

శ్రీరాముఁడు నీవేగలవు.

# శి వ కు మా ర నా ట క ము.

## ప్రా రం భ ము.

శ్లో॥ జ్ఞానానందమయం దేవం । నిర్మల స్ఫటికా కృతిం ।
ఆధారం సర్వవిద్యానాం । హయగ్రీవము పాస్యహే॥

క॥ శ్రీగౌరీవల్లభయను । రాగోల్లసిత ప్రభావ రాజేశ్వర స । ద్భోగి విభూషణ శంకర । జాగీర్ పెదమెట్టుపల్లి సదనవిహారా॥

మ॥ శితికంఠున్ గిరిజన్ రమా విభునిలక్ష్మిన్ పద్మ గర్భున్ సర । స్వతినిన్ విఘ్నపతిన్ గురూత్తమునిసంభావించి పూజించి స । న్నుతులుంచేసి నమస్కరించియును నేనుం జేయగాబూనితిన్ అతిపుణ్య ప్రదమైన యీశివకుమారాభిఖ్య చారిత్రమున్॥

వ॥ కావున ॥ తత్కథా సంవిధానంబెట్టి దనిన।

సూత్రధారి ప్రవేశించి సభ.

వంకచూచి ( తనలో )

వ॥ ఆహా! సంతోషము సంతోషము । యీసభామండలి యందలి । బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాది జనంబులా పుణ్యాత్ములగు పూర్వుల వృత్తాంతంబులువిని । కృతార్థులమగుదుమని యపేక్షించి వచ్చియున్నట్టుగా గోచరమగుచున్నది । సరి । వీరికర్ణానందంబగునటుల । మత్ప్రేయసీ రత్నంబగునటు నిరూపించి । యొక్కసత్కథా । ప్రారంభించెదగాక (అని తెరవంక చూచి)

వాదము - ఏకతాళము.

సూ॥ సారసాక్షినటురావే । యీసభాసదుల శనుగొనవే ॥సార॥ నీరా
కరునై నిఖిలజనంబులు ।కోరియున్నదిదే కొల్వుకూటమున ।నా॥౧॥

వ। సకల సంగీతసార సంగ్రహురాలవగుని

శ్లో। నీవే కనారి యిటురమ్మా॥

నటు ప్రవేశించి.

వ॥ నాథా! అభి వాదనము॥

సూత్రధారి.

వ॥ నారీ! శుభంబగు గాక॥

నటు॥ సూరివర్యనా నాథా ॥ మరు సుందరాంగ గుణయూథా॥ సూ॥
ఆరూఢిగ నన్నతి సంతోషము । తోరావించిన కారణమేమది॥
సూరి॥ ౨॥

వ। ఆర్యా! నన్నిచ్చటికి రావించిన కారణంబేమో శ్రుతపరచుడు ।
మత్కర్ణానందంబుగా విని యెదను।

సూ॥ ఇంచుబోణి యిటుజూడూ । సభకించిన్నాత్రము నేడూ॥ ఇంచు।
అంచితముగ పుణ్యాత్ముల కథలా । లించగమరియిట వేంజేసిరి
గదే॥ ఇంచు॥ 3॥

వ॥ నారీ! పురాణపురుషుల పుణ్యచరిత్రంబులు విని । ధన్యుల మనియన్యోన్యాను రాగంబున నఖిలజనంబులీ సభనలంకరించియున్నారు । కావున। వీరి కొక్క సత్కథ వినిపించి కృతార్థులం జేయవలయునని యభిలాషించి । మత్సహాయంబు గానిన్నిందు రావించితిగదా॥

నటు॥ మంచిదాయనా నాథా । వినిపించు దేదోయొక సుకథా ॥మంచి॥ సంచిత ఫలమును సఫలమొందరో । చించిసద్గతి గురించి ముదంబున॥ మంచి॥ ౪॥

వ। నాథా! యేకథా సారంబువలన। వీరలానందింతురో । యోచించి । ప్రారంభించుడు నాకైననదియే సమ్మతముగదా॥

సూ॥ శివకుమార నాటకమూ । బల్సవినయముగనూ తనమూ॥ శివ॥
కవి జేయంబడె గనుక యదియునే । వివరించగ మది వేడుక
బొడమెను॥ శివ॥ ౫॥

వ॥ సుందరీ । పరమానందకరంబగు । శివకుమార నాటకము । నవీనముగా కృతిజేయింపబడి యున్నది । కావున । యదివినిపించిన బాగుండునని । మదభిప్రాయము॥

నటు॥ అవనిపెద్దమెటుపల్లి । శ్రీశివునిమది నిరంజిల్లీ ॥అవ॥ సవిశేషంబుగ స్మరియించియునీ। వహిరశముగ నది వివరించుదియిక॥ అవ॥౽

వ॥ నాథా! పరమ పవిత్రాత్మ్యకంబగునట్టి శివకుమార నాటకమే ప్రారంభించి చెప్పెదు కాని ఇట్టి సద్గ్రంధమెవ్వరు రచించిరి రచించుమని వచించిరెవ్వరు వారివారి యభిధానంబులు శుభంబలర కృపరచి మచ్ఛృతిపుటంబు లానందింపజేయుడు॥

సూ త్ర ధా రి.

వ। మంచిది । మనోహారీ । అటులనే శృతపరచెద నిటువినుము॥

సీసమాలికము.

శ్రీలక్ష్మికరమయ్య చెన్నొందు జిల్లా కరీంనగరమును ధరిత్రియందు । పేరైన తాలూక పెదమెటుపల్లి తద్గ్రామనివాసులై దనరుచున్న । బుధనకులగోత్రసంభూతుండు శీలమంతుల వంశవార్ధి చంద్రుడు ఘనుడు । నరసింహులు సుతుండు నయగుణాన్వితుడు సత్కీర్తిపరుండు సద్వర్తనుడగు । ఛత్రియ్య సత్పుణ్యచరితుడాతని పుత్రులైన రాజయ్య కాంతయ్యఘనులు । వీరలు సత్కీర్తి వెలయ శ్రీమత్కథిలపురివాసుడయ్యి మెందుచున్న । గంగాధరాఖ్య సత్కవిని రావించి యీ మేటుశివకుమార నాటకంబు । రచనజేయించిరిల మెచ్చరమ్యముగను । అట్టి సత్పుణ్యమతుల చేపట్టి యెపుడు । భోగభాగ్యములిచ్చి సంపూర్ణముగను । శాశ్వతంబుగనేలు రాజేశ్వరుండు॥

వ॥ సఖీమణీ! వింటివా యీపృథ్వీతనంబున పేరువహించన తాలూకా జాగీర్ పెదమెటుపల్లి నివాసులగు । శీలమంతుల ఛత్రియ్య తత్కుమారులగు రాజయ్యకాంతయ్య, వీరలు కీర్తిద్రవ్యమున కపేక్షించి సప్తసంతానములలో కృతిసంతానమే ముఖ్యంబని భావించి కథలాపురి గంగాధరాఖ్య కవివర్యుని రావించి । సత్కరించి । సకలబహుమతులొసంగి యిట్టి శివకుమార నాటకము కృతిజేయించి । జగత్ప్రసిద్ధి వహించి యుండిరిగదా.

—♦ నటి ♦—

వ॥ అహాహా! ప్రాణవల్లభా అట్టిపుణ్యాత్ములనెల్ల కాలంబా రాజేశ్వర స్వామి ధనకనకవస్తువాహానాది సకలైశ్వర్యంబులొసంగి రక్షించుచుండును గాన, తదనంతర విచారమెట్టిదో నట్టిం బెట్టికస్పష్టంబుగ విన్నవించుము

సూ త్ర ధా ౧.

వ॥ మంచిది । మనోహారి । మనమీ కాలంబున నీవసంత రుతుమహిమాతిశయంబు లెన్నుచు । హాయిగా । యీపూదోటలో విహారింతమా॥

—♦ నటి ♦—

వ॥ నాథా! నాకైన నదియేకోరిక । అటులనే కానిండు॥

వాదం—రూపకము.

సూ॥ యీ వసంతకాలమెన్నయేది వశమహో ॥యీవ॥ కేవలముగశుకశిఖికోకిల రావముల మితముగను । వేవిధముల మానసముకు । వింపొనరించెను భళి భళి॥యీవ॥ ౧॥

వ॥ నారీ! యీశుకపికమయూరాది విహంగధ్వానంబులకు । నా డెందంబానందంబు నొందెగను గదా॥

నటి—జీవింతేశ భల్లగాలిపీవ నామదికి ॥జీ॥ వావిరిగను సంతసమును వరలెగాన జుమ్మటంచు । యేవిధి భ్రమరముల మ్రోత। లెంతయు వింతగు చుండెను ॥జీవి॥ ౨॥

వ। నాథా! యీమందమలయ మారుతంబునకు । తుమ్మెదల ఝుంకార రవంబులకు । నామనంబు వికలంబై । మకరాంకుని కేళిలో పురికొల్పుచున్నదిగదా॥

సూ॥ పండుజ్యోత్స్నకాక కెంతొనిండె తాపముగ ॥పండు॥ మెండగుపూవిల్తుదెంతో మేలిమిపుష్పాస్త్రములను । అండగొనియు వేయసాగె । అతివామదిప కలంబుగ ॥పండు॥ ౩॥

వ॥ తరుణీ । యీ వెన్నెల కాకకు । మన్మధునిధాకకు । నామనంబు నిల్వకున్నది । యొకసారి కౌగలించి । నా డెందం బానందింపజేయుము॥

చిటె॥ పండితవర పెద్దమెట్టుపల్లివాసుడౌ ॥సంది॥ ఖండపరశునాత్మయుం
డుదండిగ నమ్మియును మనము । నిండుగయీ వనమునందు ।
నేటుగ విహరింతుము సఖి। పండి॥౪॥

వ॥ నాథా! మనమీపూదోటలో హాయిగా విహరింపుచు । నీనాము
నోరథంబులు సఫలీ కృతంబుగాజేసి కొందము రండు॥

సూ త్ర ధా రి.

వ। సరిమంచిది । అటులనే గావింతము రమ్ము.(అని నిష్క్రమింతురు)

# ఉ క్కు కో ట.

## ధర్మరాజు ప్రవేశము.

దర్వు—యేకతాళము.

క్షితీశచంద్రుండనురా। యీక్షితిధర్మరాజ నామముంగల।క్షి॥
ప్రతీతగుణశౌర్యధుర్యుడ మనః। కుతూహాలుడ నుక్కుకోటనుం
దిర ॥క్షితీ॥౧॥ శునాసీరవైభవుడా । సత్సునీత మానసుడనీతిమంతుడ॥
శునా॥ అనూన విస్ఫురదనేక వాహిని । జనానందయుతమనోజరూడ॥
క్షితీ॥ ౨॥ ధరణి పెద్దమెట్టుపల్లి । మందిరుండైన శంకరుణి మనంబున॥
ధరణి॥ స్మరించితత్పదనరోరుహాంబులు । స్థిరంగ నమ్మియు చరించుచుం
డెటి ॥క్షితీ॥ ౩।

వ॥ మంత్రిశేఖరా!

మం త్రి.

వ॥—కింభో! ధర్మరాజా!

వాదము—జల్వ తాళము.

ధర్మ—సచివోత్తమ మన రాజ్యమంత సకల సుఖమెనా వచియించు
మెట్టిపంతలేక వరలుచుంద్రెడెకా॥ సచి॥౧॥

వ। మంత్రీ! మనరాజ్యంబునంగలయీ వజ్జనంబు లెట్టి శత్రువులచే
నేమి భయంబులేక తమ తమ పుత్ర మిత్ర కళత్రాదులతోసు
ఖంబున నున్నవారలే కదా॥

మం. సుచరిత్ర ధర్మరాజ వినుము సుఖమెనంతయూ ॥యెచటగా మరే
మి కొదువవేకనె నసియుండియూ ॥సుచ॥ ౨॥

వ॥ రాజా॥ధర్మ ప్రభులరై మీరారాజ్యంబు జేయుచుండ॥ నెట్టి మానవులకెట్టి సంకటంబులు వాటిల్లును । యేమియును లేదు । మీకృపా విశేషంబున మనరాజ్యమంత క్షేమమేయున్నది । మహాప్రభో!

ధర్మ—గణికా వధూటులగా నటుంప । గకన్యనబిలువ్వూ । ప్రణుతింప
సర్వపండిత వర్గము నటుగలువ్వూ॥ గణి॥ ౩॥

వ॥ అమాత్యవర్యా । గానకళాధురీణులగు వేశ్యాంగ నలరావించి ।
సకల సంగీత నృత్యంబులుంకావించి । సర్వపండితులచే సర్వధర్మం
బులుం దెలుపునట్లొనరించి । నామనంబానందింప జేయుము॥

మం॥ గణుతింప పెద్దమెటుపల్లి కాలకంతుని॥ ప్రణుతించిమీరలను విధం
బె పరగజేస్తినీ ॥గణు॥ ౪॥

వ॥ రాజా । మీరానతిచ్చు విధంబుననే । సర్వంబు నొనరించినాడ ।
ఇదో మీకందోయికి విందుగా వీక్షింపుడు॥

ధ ర్మ రా జు.

వ॥ సరిమంచిది । మంత్రివర్యా ॥ నేడి దే స్నానసంధ్యానుష్టానంబునకు
వేళమైనది । లోనికేగుదమురమ్ము॥

మ ం త్రి.

వ॥ చిత్తము । ప్రభో (అని నిష్క్రమింతురు)

సుజ్ఞానమూర్తి ప్రవేశము.

దర్వు—యేకతాళము,

సుజ్ఞాన మూర్తినిరా । సర్వజ్ఞ వేదశాస్త్రవేత్తనగునే॥ సు॥ఆజ్ఞులైనవారి నెల్లమమకారాంధ భావమెల్ల దొలగ చేసియు । ప్రాజ్ఞులుగ నుచేసి కీర్తిబొందిన । పరమనీతి । ప్రభుడఖ్యాతి ॥సు॥౧॥ ధర్మతత్ప్రోధనుడా । సద్ధర్మవర్తనుండ కోవిదుడనే ॥ధర్మ॥ ధర్మరాజు గురుడ నిర్మలుడ సత్కర్మములనుజేసి వెలసినట్టియ । కర్మమోచనుండ సాధుమతుడవి । కారదూర॥ కరుడధీర ॥సు॥౨॥ పేరైనవాడనురా । శ్రీపెద్దమెటు

పల్లిశివునినమ్మినః పేరె। సీరజారిముఖుడవారవారగంభీరమూనసుండవా దిభీకర । భూరిగుణుడ నిర్వికారుడనుభవ । దూరమతుడ । ధీరయుతుడ ॥సుజ్ఞ॥ ౧౩॥

వ॥ ఓహో! నేనిప్పుడొక్క కార్యంబును గురించి, మత్ప్రియ శిష్యుండగు ధర్మరాజు పాలికిం బోవలసివచ్చితి, కావున నేనచ్చటకిం జని యారాజుచే తత్కార్యంబు నిర్విఘ్నంబుగా కొనసాగించెద గాక (అని ధర్మరాజు వద్దికింజనినంద)

ధ ర్మ రా జు,

వ। గురువర్యా! నమస్కారము,

సు జ్ఞా న గురు వు.

వ॥ ధర్మరాజా! వర్ధిల్లుము వర్ధిల్లుము.

నాదము—జుల్వాతాళము.

ధర్మ—గురువర్యా గురువార్యా పరము కరుణ సాగర నీరాకరుచుంటి మద్భాగ్యము। గురు॥ విరివిగ మద్గేహ మెంతో విశదముగ పవిత్రమయ్యె । మరియును నేనెంతో ధన్యుడనైతి మహాదయాత్మ ॥గురు॥ ౧

వ॥ గురువర్యా! మీరాకచే విచ్చేయుటచే మద్గృహంబు పావనంబైయె నెంతో ధన్యుండనైతిని మహాత్మా మీరాగమ్మనే పీఠంబలంకరించి మమ్ముల కృతార్థులంజేయుడు॥

సుజ్ఞా॥ నరవరా । నరవరా । నరసీభక్తి పరిభావగరిమకు నే మెచ్చినాడ మరియుది నెరవేర్చవలయు ॥నర॥ ౨

వ॥ రాజా! । నేనొకగొప్ప కార్యంబును గురించి నీవద్దికి వచ్చితి।అది తప్పక నెరవేర్చవలయును.

ధర్మ—యెట్టిదో । యెట్టిదో । గుట్టుగయా కార్యము వోగురువర వచించుమనాతో ॥యెట్టి॥ నటులేకనే నాపని నయముగ నెరవేర్చువాడ ॥ వట్టిమాటగాదు నిజము వాక్రుచ్చితి నినుయాన ॥యెట్టి॥ ౩

వ॥ గురువర్యా! నీమనంబునం దలపెట్టిన కార్యమెట్టిదో । నటుబెట్టిక

స్పష్టముగ విన్నవించుము । నీపాదసాక్షిగా । నే నాకార్యం బుంజేసి యేతీరగలను॥

సు। అట్లులై । నట్లులై । నట్యైతే నీతోనేను గట్టిగ వచియింతు వినుము। అ॥ పట్టి విడువ నాదు యదియు పరమ శుభప్రదముగాన। గట్టువిల్లుసాక్షిగ వినినట్టి వార్త శృతముజేతు। అ॥ ౪॥

వ॥ రాజా! అట్టి కార్యంబు విన్నదించెద నిటువినుము.

సీ॥ కల్యాణపురినుండు ఘనుడు బసవేశుండు పన్నెండువేల్ మహేశ్వరుల గూడి । శ్రీశైలయాత్రకై శీఘ్రమేగంగను మనవనంబున విడిరి మరియుచేసి ।జలముకై వెదకి తజ్జలము లెచ్చటగనక శైవులు క్రోధులై శాపమివ్వ । దలచిన వారించి తద్బసవేశుండు ననుబిలచి పలికెనో యనఘయిచట। నీరములులేవు మాకెంతో జేర్రశమలు గానమే మేగివచ్చుతరి పూనియిచట । జలములుంటెనె లెకున్న తజ్జల లేమి । లేనియెడ మంచిగుండదో జానియనుచు । నెంతో నిష్ఠూర మాడి తానెగెగిరికి।

వ॥ కావున శ్రీబసవేశ్వరుండు కల్యాణ పట్టణమునుండి పన్నెండువేల మహేశ్వరులం గూడి శ్రీశైలయాత్ర బోవునెడ మనవనాంతరంబులోదిగి యవ్వనంబున నీరు దొరకనందున చాలాకోపించి నన్ను బిలచి ఓయీ! మేమూ శ్రీశైలమునుండి వచ్చువరకు యిచ్చటజలంబులుంటెకాని। లేకున్న బాగుండదని చాలాతీక్ష్ణమైన మాటవాడి పోయెనుగదా అట్టివార్త నీతోచెప్పుటకై వచ్చితిని । విన్నావా॥

ధర్మ—అరయగా అరయగా గురువరయ మ్మహానీయుడు పరశివుడు పరాత్పరుండు ॥ అర॥ మరిమనపై యింతకోపమతినై దూషణములాడ। విరివిగనెటులోర్తు ముందుసరణియేరో శృతముజేయు॥దర॥ ౫

వ॥ గురువరా । కేవలపరశివుండగు బసవేశ్వరుండు కోపించిన వలదను వారెవ్వరున్నరు । ఇందుకు నామదిబెగ దొందుచున్నది । మనవనాంతరంబులో నీరులేనిదే గొప్పతప్పు యింకనాతదు మరలవచ్చిన

నేమని శపించునో కావున ఇందులకై ముందటి విచారమేదో కృప
చేసి వినజేయుడు.

సు॥ యిరవుగా యిరవుగా । నరవర నీవదిని తాపమదియెందుకు విను
ము యొకటి ॥యిర॥ కరమరుదుగ నొక బావియు కడువేశము ద్ర
వ్వించుము । ధరణిని పెదమెట్టుపల్లి ధాముని కృపగలను పిదప॥
యి॥ ౬॥

చ॥ నరవరనీవు చింతిలగ న్యాయమెయవ్వన సీమలోననే । దరువుగ
నొక్క బావియురయంబున నిప్పుడు ద్రవ్వియించు మం । దరయుగ
నీరు గల్గిన మహాబసవేశుడు సంతసించునె । వ్వరికయినన్ మహా
ముదముపర్ధిలు నైనపరోపకారమే॥

వ॥ నరవరేణ్యా! నీవాదనాంతరంబులో నొక్క బావి ద్రవ్వించుము త్రవ్వించిన నందులో జలంబులూరిన నెంతోమంది బాటసారులకాజలంబులు సహాయపడును అదియును గాక ! బసవేశ్వరుండు చాల సంతోషించును, ఇదిపరోపకారమే కదా కావున నీవ వశ్యముగా నా మాటనమ్మి బావిద్రవ్వించుము తడయవలదు.

ధర్మరాజు.

వ॥ గురువరా ॥ మీ యనుమతి విధంబుననే । నూతితోడించెదను ।
సందేహమేమి । బసవేశ్వరుని మెప్పి ॥ మనకు వెప్పుగదా॥

సుజ్ఞాన మూర్తి.

వ॥ రాజా! మరచియుండకుము సుమా ! నేబోయెదను.

ధర్మరాజు.

వ॥ చిత్తము స్వామీ నమస్కరించెదను.

సుజ్ఞాన మూర్తి.

వ॥ రాజా! శుభంబగు గాక (అని నిష్క్రమించును)

ధర్మరాజు—మంత్రితో.

వ॥ మంత్రీ వింటివా మనగురువర్యులగు సుజ్ఞానమూర్తి వాక్యము వారి యనుమతి విధంబుననే బసవేశ్వరుని మనోసమ్మతిగ మనయుద్యాన వనంబున నొక బావి ద్రవ్వించ వలయును. కావున కామాటీలను వుప్పరివాండ్లను రావించి ప్రారంభము చేయించుము॥

-: మం త్రి :-

వ. చిత్తము ప్రభో! అట్టులనే సేయించెదను (అని వుప్పరివాండ్ల నుబిలిపించి పాతాళలోకము ద్రవ్వించిన బావిలో జలంబులూర నందు నవిసిగి వేసారి, తనలో) ఆహా! ఇదియేమి యాశ్చర్యము యీావనాంతరంబులో నెంతద్రివ్విన బావిలో నీరుపడుటయే లేకగదా ఇదియేమి విక్కల్పమో కాని తెలియదు ఇట్టివార్త మాయజమానియగు ధర్మరాజున కెరింగించెదగాక (అనిరాజు వద్దికింజని) హే రాజన్ ఇటుకారి వినుము.

ధ ర్మ రా జు.

వ॥ మంత్రీ! యేమి సమాచారము బావిద్రివ్వించినవా లేదా॥

మం త్రి

వ॥ రాజా। మీరానతిచ్చు విధంబుననే। వుప్పరివాండ్లను రావించి। యవ్వప్రాంతరంబులో బావిపట్టించి యెంత ద్రివ్వించినను। వుదకమూరుటయే లేదు। ఇదియేమి చిత్రమోకాని। తెలియదు॥

ధ ర్మ రా జు.

వ॥ యేమి! బావిలో జలమూరుటయే లేదా అయ్యో ఇగ యెట్లు.

మం త్రి.

వ॥ రాజా! యెంతధనము వ్రియము జేసియెంత ప్రియాసపడిన జలమూరుట యబద్ధముగానున్నది. ఇప్పటికెంతో ధనము వ్రియమైనది గదా.

ధ ర్మ రా జు (తనలో)

వ॥ హా! దైవమా ముందువిచారమేమి నాకెటు దోచుతులేదు ఇక నేనేమి సేయుదు.

గీ॥ దైవమా యేమిసేతు యీాధాత్రియందు। యేమిజేసితినో పాపమెరుగరాదు। యెంత ద్రివ్వినబావిలో సురితమైన। నీరమును బుట్టదిదియేమి కారణంబొ॥

వ॥ హా దైవమా! రెంట జెడ రేవడన్నట్లు ధనోదకంబులకు రెంటికి బెడిసితిని యెంత ప్రయాసపడిన నేమి ఫలంబుగానైతిని; హా! సర్వేశ్వరా! శంకరా! ఇక నేమి సేయుదు.

(అని చింతాక్రాంతుండై యున్నంత)

ఆకాశవాణి వాక్యము.

వ॥ ఒకే! ధర్మరాజా ఇంకొకసారి నామాట వినుము నేనాకాశవాణిని.

ధర్మరాజు.

వ॥—తల్లీ! యేమి యాలోచన.

ఆకాశవాణి.

వ॥—నీవెంత ప్రయాసపడిన యీ నూతిలో జలంబులూరవు నీవుధర్మస్వరూపివి కావున యీ బావికి నీవు బలిహారమైన యెడల జలోత్పన్నంబు కాగలదు విన్నావా॥

ధర్మరాజు.

వ॥ తల్లీ! నీయనుమతి విధంబుననే నేనీ బావికి బలికి బలహారమగుదును గాని నేనా శ్రీబసవేశ్వరుని చరణారవిందముల దర్శనార్థమై నిరీక్షించుచున్నవాడ కావున యట్టిపద్ధతి నాకొనగూడు యుపాయంబు జెప్పిన నేనీ బావికి బలి హారమగుదును.

ఆకాశవాణి.

వ॥—మంచిది! నీకట్లున్న యెడల నీప్రియకుమారుండగు తాతకుమారునైన హారమివ్వుము లేక నీకూడలుయగు గిరిజావతినైన యివ్వుము యెవ్వరినైన యీ బావికి బలిహారమివ్వనిది యుదకంబు బుట్టదు విన్నావా

( అని అంతర్ధానమగును )

ధర్మరాజు—మంత్రితో.

వ॥ మంత్రీ। వింటువా యీ యాకాశవాణి వాక్యంబులు। యెవ్వరేకాని। యీ బావికి బలిహారము కాని యెడల వుదకంబు బుట్టదట। కావున। మత్కుమారుండగు తాతకుమారునిం బిలుచుము। వాని నీనూతికి బలిహార మిచ్చెదను॥

మంత్రి.

వ॥ అయ్యో! నరనాయకా! యీపృథివిలోకన్న కుమారునిట్లు జేయువారున్నారా! ఇదెంతన్యాయము॥

ధర్మరాజు.

వ॥ అనంతనాకుం దెలుసును వీవట్లుండుము (అని సేవకునితో) సేవకా ఇటు రమ్మా.

సేవకుడు ప్రవేశించి.

వ॥ దొరా! యేమి సెలవు.

ధర్మరాజు.

వ॥ నీవీతక్షణంబున। మదీయాంతః పురంబున కేగి। మత్కులసతియగు సత్యావతినడిగి। నాకుమారుండగు తాతకుమారునిందు దోడ్కొనిరమ్మా। లేక నాకోడలను గిరిజావతినైన దోడ్కొరమ్మా।పొమ్మికిదియే శలవు॥

సేవకుడు.

వ॥ చిత్తము! ప్రభో (అని నిష్క్రమించును)

సత్యావతి ప్రవేశము.

దర్వు—యేకతాళము.

గిరిజామనోహరా ననుబ్రోవా అరుదెంచవదేరా ॥గిరి॥ సరసీరుహోద్భవపూజిత। సువిరాజిత। బుధసేవిత। కరుణామయాత్మకా ననుబ్రోవా అరుదెంచవదేరా ॥గిరి॥ మునిబాల సోమగిరీశ్వరా। పరమేశ్వరా। జగదీశ్వరా। వనమాలి మిత్రమహేశ్వరా। యిటుజనుదెంచవదేరా ॥గిరి॥ ౨॥ వరశీలమంతుల ధత్రియా। పరిపాలయా సుగుణాలయు ధరపాల పెదమెటుపల్లీశ్వర ననుదరిచేర్చవదేరా ॥గిరి॥ 3

వ॥ నిచ్చెలీ భ్రమర కుంతలీ!

చెలికత్తె.

వ॥—తల్లీ! సత్యావతీ యేమిశలవు.

సత్యావతి.

గీ॥ వనిత నేడే మొకాని నాహిమభుజము। యెడమకన్న దరుచున్నది యేమిహేతు। వో కనిమదీయమదినిల్వదొకటనైన। నిట్టిదుశ్శ కథముల నెన్నడెరుగనైతి॥

వ॥ నెచ్చెలీ। నేడేమొకాని। యనేక దుశ్శకునములగు పడుచున్నవి। యేమి హేతువో కాని। తెలియకున్నది గదా॥

చెలికత్తె.

వ। తల్లీ। అంతఃపుర నివాసినివగు। నీకేమచ్చటేమి జెలియును। నేడొక గొప్ప విఘాతకార్యంబు గా బోవుచున్నది। యదినీతో నేనేమని చెప్పుదు॥

సత్యావతి.

వ॥ నెచ్చెలీ। అదెట్టివిఘాత కార్యంబో। నాకొకసారి చెప్పరాదా। నామనంబెచ్చట నిలుచుటలేదు గదా॥

వాదము—ఆటతాళము.

చెలి—యేమని తెల్పుదును కోమలి నీకాస్థిడీ। కాముక భూపాలుడు గైకొనె నొకపద్ధతీ ॥యేమ॥ ౧॥

వ॥—తల్లీ! రాజాంగనా నీప్రియుండగు ధర్మరాజు నేడొక ప్రయత్నంబులో నున్నాడు. అది నీతో నే నేమనిచెప్పుదు నోరాడకున్నది గదా॥

సత్యా— సోమనిభానన భూమీశుడు యేపని। నేమించియుండెనో నిజముగ దెల్పవెనినీ ॥సోమ॥ ౨॥

వ॥ నెచ్చెలీ। మన్నాథుండు నేమించిన కార్యంబెట్టిదో। విన్నదున్నట్లు చెప్పుము। దాచవలదు.

చెలి॥ గురునియనుజ్ఞ నొక కూపము ద్రివ్వించెనూ। నురువగునందు జలమూరక చింతించెనూ ॥గురు॥ ౩॥

వ। తల్లీ. మనగురువర్యులగు సుజ్ఞానయార్తియను మతంబున మనవసాంతరంబులో నొక బావి ద్రవ్వించినవంటు జలంబుబుట్టినందున నీవల్లభుండు చింతచేనున్న యెడ గగనవాణి యొక వాక్యము బలికెనట అదెట్టిదన నీకుమారుడైన నీకోడలునైన యీ బావికి బలిహారమిచ్చిన

మొదల యుదకనుమారుకని యన్నంపుల నద్ధరణీశ్వరుండా ప్రియత్నంబు లోనున్న వాడనపుంటిని అది తప్పునా.

సత్యా—హరహర యెంతపని యానిది చూడగనూ । మరియొకడే నాకును వరకొమారుడింకనూ ।హర॥ ౪॥

వ హరహరా! యెంతమోస మెంత మోసము; వున్న ఒక కుమారునా సాతికి బలిహార మివ్వమన్నాడుండె కెనెన్ని ఇదంతనా దుర్భాగ్యమే అయినా ముందటి విచారమేదో యోచించి॥ దాచింత బాపుము॥

చెలి॥ మదం నినందను మరియీదివసంబునా । పదిలము గెట్టకైనను బం పుటమే తానన్నామన ॥ ౫॥

వ॥ అమ్మా! నీపుత్రుండగు తాతకుమారుని యీ దినంబున నెచ్చటికైన దప్పించినచే మంచిది, ప్రాణంబులుండిన యెన్నటికైన గాన్పింగగలము యిప్పుడీ రాజుచే బలాత్కారంబున ప్రాణముల్ బోయిన ఫలమేమున్నది అదిగాక నీకొక్కడే కుమారుడు గదా॥

సత్యా—సుదతిరో నీవాక్యము చొప్పునవర్తించెదా । పెదమెటుపల్లి సత్సదనుని ప్రార్థించెదా ॥సుద॥ ౬॥

వ॥ నెచ్చెలీ! రాజుగారి యాజ్ఞగాకముందే నాకుమారుని నెచ్చటికైన వెళ్ళించెద గాక, ఆ పైన భగవంతుడే కలడు కావున మత్పుత్రునిం నొకసారి రావించుము.

చెలికత్తె.

వ॥ మంచిది । అటులనే రావించెద । తొందరొందకుము

(అని నిష్క్రమించును)

తాతకుమారుడు ప్రవేశము.

దరువు—యేకతాళము.

తాతకుమారుడ భూతలమున ప్రఖ్యాతి వహించిన ఘనబలాఢ్యుడను । నీతిమంతుడపు నీతమానసుడ చాతుర్యుడ పురుహూతవిభవుడను ॥తాత॥౧॥ ధర్మరాజు నిజతనయుడనై తనపేర్మి వహించినపేర్మాస్పదుడను । దుర్మదాంధులను దూరముజేసిది నిర్మల హృదయుల నెరి గూడుందును ॥ తాత॥౨॥ ఘట్టిగ శ్రీపెద మెటుపల్లి నిజపట్ట భద్రు

డగు పరమాత్మునందును । గట్టువిల్లు కరకంఠుని మాన్మది పట్టువిడక మరి ప్రస్తుతించెదను॥ తాత॥ 3॥

వ॥ ఓహూ! మజ్జననియగు సత్యావతి నన్నుం మల్లో రమ్మని యాజ్ఞాపించెనట యేది! నేనచ్చటికేగి యావృత్తాంత మేదో। తెలిసికొనియెదగాక (అని తల్లివద్దజని) తల్లీ నమస్కరించెదను। నన్నింతతొందరగా రావించిన కారణంబేమో శృతపరచుము।

స త్యా వ తి.

వ॥ నాయనా! తాతకుమారా వర్ధిల్లుము వర్ధిల్లుచు నీకడేంత సంకటంబు ప్రాప్తించి వచ్చెరా తండ్రీ॥

తా త కు మా రు డు.

వ॥ అమ్మా ఆదెట్టి సంకటమో చెప్పుము నే వినియెదను॥

వాదము॥ యేకతాళము.

సత్యా॥ తనయా యేమని వినిపింతు యావార్త వినజేయ నోరాడదూ తనయా॥ తనయా॥ తన॥

వ॥ తనయా నేనట్టివార్త జెప్పుటకు నామది ధైర్యంబు జాలకున్నది గదా నేనేమని చెప్పుదు॥

తా॥ జననీ శంసయ మందగను మేలయాస్థితియు। పిసజేయు మికవిందుమా జననీ జననీ జననీ॥ జన॥౨॥

వ! తల్లీ ఇంతవ్యాకుల మెందుకు నిజమైనవార్త చెప్పరాదా॥

సత్యా॥ కొడుకా నీదగుతండ్రి కడువేగ మొకబావి। పుడమిలో ద్రవింపెరా। తనయా। తనయా॥ కొడు॥ 3॥

వ॥ నాయనా! యీతండ్రిగారు మనయుద్యాన వనములో గురుమూర్తి యనుమతిచే నొక కూపము ద్రవ్వించెనట అందుచే నీకొక కీడొందవలసి వచ్చెనుగదా॥

తా॥ కడుచిత్ర మీమాటచిత్రముగానున్నది। మాతండ్రిగారు నూతి ద్రవించినందున నాకేమికీడు సంభవించును। యాబావి ద్రవ్వుటము పరోపకారమే కదా।

సత్యా॥ ఆపూతజల మూరనంపు వలనను సిస్సు॥ ఆహారమెవబూనెరా। తనయా! తనయా! అనూ॥ ౫॥

వ. కుమారా! మీతండ్రి దర్శించి నూతిలో జలంబు బుట్టనందున ఆకాశవాణి యనుజ్ఞవిధంబున నిన్నానూతికి బలిహారమివ్వదలంచినదు కావుల యీబావికి నహాహారమైన జలంబులూరునట ఇక ఎట్లు నిన్నానూతికర్పించి నేనెట్లు జీవించగలను॥

తా॥ ఘనానాథుడీ మాడ్కి బూన మంచిదె కాని। యీనీరు బడమేల గూ: తల్లీ! తల్లీ! బూనా॥ ౧॥

వ॥ తల్లీ పరోపకారార్థ మిదంశరీరం। బనునట్లు పరోపకార విషయమై నన్నాబావికి మాతండ్రిగారు బలిహారమిచ్చినా సరేకాని జలంబులూరవలె పూరిన నెంత మహోపకారమగును ఎంత మంది జనంబు లాధారమగును। ఇందుకొరకై కొందర పడవలదు యీరోజనుము॥

సత్యా॥ యేకపుత్రుడవు నీనా కూపమునకిడిన। మాకేమి గతియున్నదీ। తనయా! తనయా! తనయా॥ యేక॥ ౨॥

వ। తండ్రి! లేకలేక నాగర్భవాస మందొకడవే జన్మించి నేడా కూపమునకు నీవు బలిహారమైన మాకేమిగతి మాగతి మోక్షంబుల కీవేయాధారమని నమ్మియుంటిమి గదా॥

తా॥ పాలికట పెనమెట్టు పల్లీశ్వరుడేగలడు। నీకీధావంతమేలా జననీ! జననీ! జననీ॥ పాలిక। ౩!

వ॥ తల్లీ! కాగల కార్యంబులు నూరుజన్మంబులకైన కాకతీరవు। కావున చింతించిన నేమి లాభము॥

సత్యవతి.

వ॥ కొడుకా! నేనొకటి జెప్పెద। అది నీవంగీకరించినా వాక్యానుసారముగ నడిచితినేని। పామదికానందంబగును లేనిచో నీపాటు జూచి నేభరింప జాలను॥

తాతకుమారుడు.

వ॥ తల్లీ నీకింత ధావంత మెందుకు అట్టి సమాచార మెట్టిదో చెప్పుము। నీయాజ్ఞమొలంనుదను తల్లికంటె వేరేదైవంబులేదని పెద్ద

సత్యావతి

వ॥ నాయనా! అట్లయినయెడల వినుము।

క॥ తనయా పుత్తర ద్వారం । బున నీవేట్లకైన బోమ్మా బోవు
నెడల న । ధ్ఘనమైన ముత్యముల చా ॥ లుచు బోసుక పో
మ్మా వానములో భీతిలక॥

వ॥ తనయా! నామాటవిన్మా ఆ పురంబున ఉత్తర ద్వారము
నుండి ముత్యాల చాలానవాలు బోసుకుంటు వెళ్ళిపోయి ఎచ్చ
టనైన బ్రతుకు పొమ్మా। ప్రాణంబుండిన మళ్ళి యెన్నటికైన
గాన్పించగలవు। మృతుంబైన నేమిలాభము। ఇదేయుత్తమాశ్వం
బుపై నెక్కి చాలినంతద్రవ్యము గట్టుకొని వేగిరంబున వెళ్ళి
పొమ్మా॥ ఆలస్యమైన బూతండిగారి యాజ్ఞకాకలదు॥

తాతకుమారుడు.

వ। తల్లీ నీయనుమతి విధంబుననే పోయెదను।నన్నాశీర్వదించిపంపుము.

సత్యావతి

వ। నాయనా! పొమ్మా జయోన్నతుడవగుమ్మా॥౧।

తాతకుమారుడు.

వ। మహా ప్రసాదము తల్లీ! (అని నిష్క్రమించి) (తోవలో) యేమి
మాతల్లి యనుజ్ఞవిధంబుననే నేనీ యుత్తమాశ్వంబుపై నెక్కి
యీయుత్తర ద్వార బునుండి ముత్యాల చాలానవాలు బోసు
కుంటు యీపెద్ద యరణ్యములో జేరితిది కాని మారుమగుటచే
తురంగ మలసి యున్నది। నాకుకూడా వేసారినట్లున్నది। యీ
వటావృక్షముక్రింద గుర్రమును కట్టివేసి యీచల్లనగు నీడకు
కొంతసేపు పవళించెదగాక (అని గుర్రమును కట్టివేసి మర్రివృ
క్షముక్రింద పవళించి యుండెవంత నిక్కడ)

సత్యావతి చెలికత్తెతో

వ॥ వెచ్చెలీ! మత్కుమారు నెట్టులనో యీయావలికి వెళ్ళించితిని గాని
నాకోడలగు గిరిజావతిని వెళ్ళించవలయును! లేనిచో దానికి

వ॥ గిరిజావతీ! నీమామచే నీకు మృత్యువు వాటిల్లవలసి వచ్చినది! కావున ఇదే వుత్తరద్వారిమునుండి నీవల్లభుండు ముత్యాలచాలాన వాలుకోసుకుంటు న్నో[illegible] పోయినాడు! నీవా ముత్యాలచాలుం బట్టుకొనిపోయి దీభర్తారుసంగలసి యెక్కడసన్న బ్రతుకుపొమ్మా యిక్కడనున్న నీకుహానియుం దప్పదు! విన్నావా!

♦ గిరిజావతి ♦

క॥ అత్తా నీవనువతునా! చిత్తేశుని జాడజనుదు శీఘ్రంబునయీ! పత్తన మునసే నుండిన! నిా ర్తరిఫలమేమివేమ యిదెసెబోవ ౯॥

వ॥ అత్తా! నీవిధంబునసే నాభర్తారునిం జేరబోయెద నాభర్త లేనిదెన్ని వైభవములున్న నేమిలాభము ఇదే నేబోయెదను శెలవొసంగుము॥

స త్యా వ తి.

వ సరి శీఘ్రంబున జామ్మా జయోస్నతుగాలవుగమ్మా॥

♦ గి రి జా వ తి ♦

వ॥ సరి మంచిది ఇదేనేబోవుచున్నదాన (అని నిష్క్రమించును) (అంత సేవకుడువచ్చి సత్యావతితో.

వ॥ తల్లీ సత్యావతీ! రాజుగారి యాజ్ఞయైనది నీపుత్రుండగు తొతకుమారునిందు దోలించుము తకవుజేసిన రాజుగారు కోపించగలరు॥

స త్యా వ తీ.

వ! సేవకా రాజుగారి యాజ్ఞయినచో మంచిదేకాని మాతొతకుమారుడిచ్చటలేడు యెచ్చటబోయినదో యేమో!

సే వ కు డు.

వ॥ అమ్మా! నీకుమారుండు లేనియెడల నీ కోడలగు గిరిజావతినైన దోలించుము!

స త్యా వ తీ.

వ॥ ఆమెకూడా ఇచ్చటలేదు యెచ్చటికేగెనో యేమో నాకుం దెలియదు ఇట్టివార్తా రాజుగారికో చెప్పుపొమ్మా॥

సే వ కు డు.

వ॥ సరి మంచిది (అని ధర్మరాజుం జేరి) దొరో ధర్మరాజా! ఇటొకసారి వినుడు॥

ధర్మరాజు.

వ॥ సేవకా! యేమి సమాచారము కుమారుండు వచ్చెనా!

సేవకుడు.

వ॥ రాజా! నీకుమారుండు నీకోడలి సమేత మెచ్చటికో వెళ్ళిపోయినాడు యెచ్చటజూచిన గానంబడలేదు యికనేమి సేయుదు నేను తేబోవుచున్నవాడ (అని నిష్క్రమించును)

ధర్మరాజు మంత్రితో.

వ॥ మంత్రీ! ధర్మప్రకటము మత్కుమారుండగు శివకుమారుడు భార్యా సహిత మెచ్చటికో వెడలిపోయెనట యిగయెల్లు మందరివిచారము బలిహారంబులేనివి యీబావిలో జలబులూరుటెల్ల యిగ యెవరి నిత్తును!

మంత్రి

వ॥ రాజా! యెల్లెమున్నది యీశ్వర కటాక్షమెట్లో యట్లాగులగు నెంతచింతించిన నేమిలాభము!

ధర్మరాజు.

వ॥ అప్పను కాగలకార్యంబు కాకపోదిక చింతించిన నేమి ప్రయోజనం బున్నది దారమ్మ నాని కేగుదము॥

మంత్రి

వ॥ పాపమ్మ (అని నిష్క్రమింతురు)

గిరిజావతి (తనలో)

వ॥ ఆహా! మామగారి అనుజ్ఞనిచ్చెను నేను యుత్తర ద్వారమునుండి ముత్యాలచాలు చూచ్చుటకు నిప్పుడీ యరణ్యంబుజేరితిని గాని యీయరణ్యములో యీవటవృక్షముక్రింద నొక యశ్వమున్నది. దానిక్రింద యెవరో పవళించి యున్నట్లున్నది యింక నావలముత్యాల చాలులేను యీతడు నాభర్తయే కాబోలును యేది అచ్చటికేగి చూచెదను (అని సమీపించి) ఆహా! నిజముగా నీతడు నాభర్తయే అయినా మార్గాయాసముచే సొలసి పవళించియున్నాడు కావున మేల్కొల్ప ధర్మంబుగాదు మేలు

కొనువరకు నేనీతని పాదసేవ జేసుకుంటు యుండెదగాక (అని పాదసేవ జేసుకుంటు యున్నంత)

తాతకుమారుడు మేలుకొని (తనలో)

వ॥ ఆహా! యేమి యీమె యెవ్వరోకాని నాపాదసేవ జేయుచున్నదే పా భార్యయగు గిరిజావతియా యేమి (అని బాగావీక్షించి) ఆ-నాభార్యయేకదా మళ్ళినాకిది యొకసంకటంబుఘటించెనా ఏమి (అని పరికాశముగా) సుందరి! గిరిజావతి నీవిచ్చటికి వచ్చిన కారణంబేమి యొంటరిగానుండు నాకు వొకసంకటమా॥

♦ గి రి జా వ తి ♦

వ॥ నాథా! నీవెచ్చటుండిన నేనచ్చటనే యుండెదను నీకంటెయెక్కువ నాకేమున్నది పతివ్రతలకు భర్తను విడనాడియుండుట ధర్మంబుగాదు గదా॥

తా త కు మా రు డు.

వ॥ మంచిది నిర్మనుష్యంబగు యీయడవిలో నెందుబోగలవు నా వెంటనేయుండుము సతికి పురుషుడేగతి పురుషునికి సతియేగతిగదా॥

♦ గి రి జా వ తి ♦

వ॥ చిత్తము మనోహరా తనయాజ్ఞ మెలంగెదను (అని యారాత్రి నచ్చట గడిపి మరునాడు భర్తతో) మనోహరా! ఇటొకసారి నామనవి వినుడు॥

తా త కు మా రు డు.

వ॥ మనోహరి! యేమి మనవి॥

వాదము-మేకతాళము.

గిరి॥ వోనాథ వినునామనవి॥ వినుపించెనహా వొనరంగనేనీ శుభమవి॥ వోనా॥ యీనాడు నాకేమోకానీ చాలదాహమొదలే॥ గాన జలములుదెచ్చి నాప్రాణంబు నిలుపవయ్యా॥వో॥

వ॥ నాథా! నేడేమోకాని నాకనేకముగా దప్పియగుచున్నది కొన్ని జలంబులం దెచ్చిపోసితేనే కాని లేకున్న నాప్రాణంబులుండక్కవు॥

తా॥ మీనాక్షి యిదియేమి సంకాటము ఘటించెనూ। యీనాడు మరి నాకు యింకా॥ మీనా॥ నేనెంను బోయి తెత్తు యానీరు నిన్నిటవిడచీ! పూని యిది ఘోరాటవియాగాని చటమృగములుగలవూ ॥మీనా॥౨॥

వ॥ నారీ! ఘోరారణ్యంబులో నిన్నొంటరిగా విడచి నేనెచ్చటికేగి నీరం బులుం దెత్తును యిచ్చట క్రూరమృగంబులుండును గదా స్త్రీ వగు నిన్నేమనునో॥

గిరి॥ అటులైన విను నాదుమాటా। యీదాహముచే లిటనిల్వగా జాల తేటా ॥అటు॥ కుటిలంబుగాదు నేనింకట గర్భవతినా నేసి। పటుదాహము నమృతి ఘటియించు ద్వయహత్యలువూ ॥అటు॥౩॥

వ॥ నాథా! నేనిప్పుడు గర్భవతినై యున్నదానను యీగొప్పనగు దప్పి చే హతంబైన స్త్రీహత్య శిశుహత్య రెండుహత్యలు ప్రాప్తిం చును। నేనైతే యీదాహమున కోపజాలను। దీనిచే మృతం డగునట్లేయున్నది। ఇగ యెట్లు।

తా॥ కటాకటా యిదియెంత మోసామొచ్చెను నాకిఃదూ। యెటుదోచ నీరుకోసా॥ కట॥ వెంటబోదు నిన్నిటవిడచీ కుటిలాలకిది ధర్మనం। కట మొదలెగాన శివునీ కరుణెట్లుగలదోకానీ ॥కట॥౪॥

వ॥ నారీ! నేడెంతకష్టము సంభవించి వచ్చెను ఇది ధర్మసంకటమేకదా! జలంబులేనిది నీప్రాణంబు లుండవు। ప్రాణంబులుబోయిన రెండు హత్యలు సంభవించును! యిచ్చట నిన్నువిడచి పోవ నామనం బొప్పకున్నదిగదా॥

గిరి॥ యీరీతిగను నీవు చింతా జేయగనేలనూ। యీనాడు వో నాథ యింతా ॥యీరీతి॥ ఆరూఢిగను యిద్దర మీ యశ్వములపై నెక్కి యూ॥ నీరెచట నున్నగానీ నెరజాడదీతముపకూడీ ॥యీరీ॥౫॥

వ॥ నాథా! నన్నిచ్చట విడిచిపోవ నీమనం బొప్పకున్నయెడల మన మిర్వుర మీయశ్వంబులపై నెక్కి జలంబులా జాడనరయుచు పోదముపమ్మి యెచ్చటనైన దొరికిన దాృవవచ్చును॥

తా॥ చారు శ్రీ పెద్దమెట్టుపల్లీ। మందిరుడై వెలయూ। గౌరీశ్వరునినమ్మి వెళ్ళీ ॥చారు॥ యీరమ్యమగు కారడవీ నెల్ల యన్వేషించియూ।

భూరిగను జలములజాడప్రాణిని దీకనుపమ్ము ॥చారు॥౬॥

వ॥ మనోహరీ! అట్టులైన నీయశ్వంబుపైనివెక్కుము నాయశ్వంబుపై నే క్కితిని యిద్వనాంతరమంత వెదకిజలంబులెచ్చట నున్నగాని జాడదీతము పమ్ము॥

♦ గి రి జా వ తి ♦

వ॥ మంచిది! మనోహరా ఆలాగేపోదముపమ్ము (అనినిష్క్రమింతురు)

దొండరాక్షసుడు ప్రవేశము.

దర్వు॥ రూపకము.

దొండ రాక్షసుడా। దోర్దండ విక్రముండఘురుడనునే ॥దొండ॥ దండినరాదులనైనను మెండుగభక్షించియునా। నిండుమనంబును తృప్తి యు నెరిబొందగవర్తించెటి ॥దొండరా। మాయలునెన్నో బన్నియుమం చిగృహంబులు మేడలు। పాయకనిర్మించియురా జేయుదు నటకెవరైన ను ॥దొండ॥౨॥ వచ్చిన వారలనెల్లను వరుసతోభక్షించియునే। విచ్చల విడిచరియింతును పెదమెట్టపల్లీశ్వరు కృప ॥దొండ॥ ౩॥

వ॥ ఓహో! నామాయావిశేషంబున నీగండారణ్యమధ్యంబులో నొక మెండగు నిర్జలకూపంబు నిర్మించి యందులో చిత్రవిచిత్రమగు నొకగృహంబు నిర్మాణించి దానికి యరుపైయారు సోపానం బులుబెట్టి యొకనేల జొయ్యారముంచి ధనధాన్య మలయుక్త ముగా సిద్ధపరచి యందుండి యీవచ్చు తాతకుమారునికి జల మగుపరచి నాలోపలికి వచ్చునట్లుజేసి భక్షించెదగాక (అనియ ట్లుజేసిలోపల ప్రవేశించి యుండెనంత)

తాతకుమారుడు భార్యతో.

వ॥ సతీ । గిరిజావతీ । మనమెంత వెదకిన పానీయంబులు దొరకుతు లేవుగదా । ఇగయెట్లు॥



గి రి జా వ తి.

వ॥ అవునుగదా నాథా ! యింక కొంత దూరమేగి చూతము (అని కొంతదూరమేగి చూచి) ఆహా! మనోహరా ఇచ్చటనొక బావి యగు పడుచున్నది. అందులో జలంబులుండవచ్చును యేది పోదము పమ్ము!

తా త కు మా రు డు

వ॥ మంచిది రారమ్మా (అని బావిని సమీపించి) తరుణీ యిప్పు డుగదా మనకోరిక ఫలించినది చూడుము యీబావిలో జలము లెంత ధావళ్యముగా నున్నది నేనీ జాలి చెంబుచే చేదినీకుంబోసి నీదాహ శాంతి దీర్చెదను (అని చేదబోయిన నీరందకున్నంత) (తనలో) అహా! ఇదియేమి విక ల్పము నేలెంత తాడు వేసి చేదిన నుదకంబందుటమే లేదు ఇది యొక వింతగానే యున్నది. మంచిది (అని తిరుగజూచి) అది గో దీనికి యరుదైరేకూరు సోపానంబులు కూడాయున్నవే మంచిది యీతంతెల వెంటలో పలికిదిగి జలంబులందెచ్చెద గాక (అనిప్రకాశ ముగా) తరుణీ నీవి గడ్డకుండుము యీ రజ్జువందకున్నది యీతంతెల వెంట జనియుదకంబు దెచ్చెదను॥

గి రి జా వ తి.

వ॥ చిత్తము! అట్టులనే తెందు నేనీ గడ్డకుండెదను:

తా త కు మా రు డు.

వ॥ మంచిది ఇదేనేను పోయెదను (అనితంతెల వెంటలో పలికి దిగియు న్నంత)

దొండరాక్షసుడు (తనలో)

వ॥ ఒహూ! నేననుకున్నట్లే యైనది యిప్పుడి తాతకుమారుని మ్రింగి నాయాంలిదీర్చుకొని యెదగాక (అనిప్రకాశముగా) ఒరే! నరాధమా వంటయింటికి కుందేలు వచ్చినట్లు నేడు నాక టికగు పడితివి యిక నిను మ్రింగక మానను నన్నెవరనుకున్నావు దొండరాక్షసుడను.

—♦ వాదము—యేకతాళము ♦—

దొం॥ ఒరేఒరే మానవాధమా ॥ఒరే॥ మరిఁ నిన్ను యిత్తరిఁ మ్రింగి
స । త్వరఁ మతుతుథయుదరుంగ జేతును ॥ఒరే॥౧॥

వ॥ ఒరే! మానవా నిన్నిదే తక్షణంబున భక్షించి నాకుక్షినింపుకొని యెద చూడు చూడుము॥

త॥ కరంబలిగి నన్ను యీవిధీ ॥కరం॥ స్థిరంగదినినేల రాక్షసోత్తమ ।
ధరఁ సీమనోస్థిరంబు జేతును ॥కరం॥౨॥

వ॥ రాక్షసేంద్రా! నన్ను నీవు మ్రింగిన నేమి లాభమున్నది. నీకనేకముగా క్షుధమైనయెడల నీకెంతో యాహారంబు దెచ్చిపెట్టెదను దయ దలంచినన్ను విడువుము॥

దొం॥ ఇటుల్ బల్క — నేనువింటునా ॥ఇటుల్॥ ఇకెందరినో దింటుంటిల్
గాదుముకు । తటుకుక్కనను నిను ఱటుకుక్కమని యెద ॥ఇటుల్॥
॥౩॥

వ॥ ఒరె! ముందెందరినో మానవులండింటిని గాని నీవంటి రాచకుమారుని నెప్పటజూడలేదు ఇప్పుడు నాకు టికి అగుపడితివి ఇక నిన్ను విడిచేదిలేదు. మ్రింగకమానను ఇదేనిన్ను మ్రింగెద గాక ఆ (అని నోరుదెరచి కొనమీద బడును)

తా॥ హాటంబేల యింతనాపయిన్ ।హాటం। స్ఫుటంగ పెదమొట్టుపల్లి శం
కర యెటుల్ బోవ్రి చెదవో యిటీవలనను ॥హాటం॥ ౪।

వ॥ హా! శంకరా! పాపభయంకరా యీదొంగ రాక్షసుడు నన్నువిడిచే అట్టులేదు యిక నన్నెట్లు రక్షింతువో దేవా మహానుభావ॥

దొం గ రా క్ష సు డు.

వ॥ ఒరే! మానవా! నిన్నిదే మ్రింగెదను చూడు చూడుము ( అని మ్రింగును) (అంత)

గి రి జా వ తి (తనలో)

వ॥ హా! దైవమా నాపల్లభుండు జలంబుకై యీసూర్తితో దిగి యింతసేపాయెను ఇంకరాలేదాయెను గదా లోపలనే మాయనో యెచ్చటికి బోయెనో తెలియదుగదా ఇగ నాథను వచ్చుటకల్ల నే నీ దప్పికి నోపజాలను ఇచ్చటుండిన క్రూరమృగంబులేమి జేసునోకదా। ఇగయెట్లు యెట్లేమున్నది నేనీయశ్వంబుపై నెక్కి నాభర్త యశ్వంబు నుంబట్టుకొని యీయరణ్య మార్గంబునంబడి పోయెదగాక.

(అని నిష్క్రమించును)

గం డా ర ణ్య ము.

చెంచుస్త్రీలు ప్రవేశము.

దరువు - యేకతాళము.

చెంచువని తేలమునేమిలనూ చెలశియూ యరణ్యంబువనూ ॥

చెంచు॥ మించిమించి బహుమేలకుపుత్తోడను । సంచరించుచువసించి యుండెదము ॥చెంచు॥౧॥ ధనురాశి మహాసాధనముల్ । పెనుకరముల దాల్చియు మృగముల్ ॥ధను॥ వనిలో నెచటున్నను గని వెదకియు । దునుమాడియుదిందు మట్టుక్రవ్యము ॥చెంచు॥ ౨॥ ధరణి పెద్దమెట్టుపల్లిలో । దగనిలచిన శివుని నాత్మలో ॥ధర॥ పరగనమ్మ్మ సప్తస్త్రీల మీకల । గిరులయందు నను దిరుగుచుండెదము ॥చెంచు॥ ౩॥

వ॥ ఓహో! ఇచ్చటికెవరోకాని, యొక మానవస్త్రీదీన వదనయై వచ్చుచున్నట్లున్నది. యెవ్వరు కావచ్చును రాని రాని మంచిది (అని అనునంతలో)

గి రి జా వ తి (తనలో)

వ॥ ఓహో! నేనీగండారణ్య మార్గంబుబట్టి వచ్చుచుండగా క్రూరమృగాదులచే నెంతో భీతిల్లుచుంటిని గాని ఇచ్చటెవరో కాని స్త్రీలగుపడుచున్నరు కావున వారిసద్దికింజనిన నామనోవ్యధ కొంతదీరును నేనచ్చటికి బోయెదను (అని చెంచుల సమీపించి యున్నంత)

చెం చు స్త్రీ లు.

గీ॥ అమ్మ నీవెవ్వరో కాని ♦ అతిశయమున
విన్నవించుము నేను ♦ నీవిందురాను
కారణంబేమినీ పేరు ♦ కావింతుపేరు
చెప్పుమీ దీనవదనవై ♦ చిక్కుటేమి॥

వ॥ అమ్మా! నీవెవ్వరు నీనామంబేమి నీభర్తారునిపేరేమినీవొంటరిగా యీ ఘోరారణ్యంబులో బడి దిక్కుమాలినదానవై దీనత్వంబున రాను కారణంబేమి అదంతయూ కుంజేప్పుము మేమెవ్వరనుకున్నావు చెంచుస్త్రీలముగదా॥

గి రి జా వ తి.

వ॥ తల్లులారా నేనేమని చెప్పుదు అయినా ఇటువినుడు॥

పం చ పా ది.

చ॥ గురుతరమైన ధర్మనృపుకోడల తౌతకుమారువల్లభిన్ । సరసత నాదుపేరు గిరిజావతి యందురు మామచేకమున్ । మరణమటంచు

దెల్సియును మామకనాథుడు నేనుగూడి యింత్తరువునరాగ నాకొరకు దివ్యజలంబులకేగి నూతిలో । మరణముజెందె నేనిటకుమార్గముబట్టుకవస్తి చెచ్చెరన్॥

వ॥ కావున మామామయగు ధర్మరాజు యొకబావి త్రివ్వించి యందులో నుదకమూరనందున మన్నాథుండగు తాతకుమారుని నన్ను గిరిజావతిని యీయూతి కాహార మివ్వదలంచిన భయపడి మేమిద్దరము సతీ పురుషులమీ యరణ్యములోబడి వచ్చుచుండగా నా కనేకముగా దాహమైనందున నీరంబులకుంబోయి నూతిలో మరణించి నందున నేనతి దుఃఖతురాలనై కొంతవరకచ్చట చింతించి ధైర్యంబున నీమార్గంబు బట్టి వచ్చుచుంటిని ఇప్పుడు నాభాగ్య వశంబున మీదర్శనమైనది కావున నన్ను రక్షించుము।

చెంచు స్త్రీలు.

వ। అహాహా! తల్లీ ! గిరిజావతి నీకింత శ్రమ వాటిల్లినదా అయిదా భయమేమి మేమేడుగురు మక్కచెల్లెండ్రము మాలోనెనమండ్రిదానవై మావద్దనే యుండుము నీవు గర్భవతిగా నున్నట్లున్నది. నీ గర్భమందుదయించిన యర్భకునిచే మనమందరము ముందు సురక్షితముగా నుతడగలము మామాటనమ్మి, యిచ్చటనే యుండుము భయపడకుము॥

గిరిజావతి.

వ। అక్కలారా! మీయనుమతి విధంబుననే ఇచ్చట వసించెదను ఆపత్కాల బాంధవులలగు మీతోనేటికి నాకోరంతలు బాసి ధన్యురాలనైతిని।

చెంచు స్త్రీలు.

వ॥ రమ్మా మాకుటీరంబుల కేగుదము॥

వ॥ చిత్తము! అక్కలారా (అని నిష్క్రమింతురు)

గిరిజావతి ప్రసవ వేదన.

వ॥ హా దైవమా! యీగర్భవేదన భరింప తరంబుగాకున్నతి గదా ఇక నేనేమి సేయుదు॥

దర్బు - జంపతాళము.

నైవమునే నేమిసేతు దాపుసేపుగా । దైవ॥ నీవెగావే వేగా । బ్రోవుమనను బాగుగా । దైవ॥౧॥

రొమ్మునకును మించు మెర్కౌ నమ్మి యిమ్మగా ॥రొమ్మ॥ యిమ్మగా నెమ్మదిగా సొమ్మసిల్లనాయుగా । దైవ।౨॥

చల్లని పెదమెట్టుపల్లి స్వామి శౌరివరా ।చల్ల। శౌరివరా । గిరి ధీరా పురహార ననుగావరా । దైవ। ౩।

( అంతనొక మొగశిశువు జన్మించినఁజూచి )

వ॥ ఆహా! యీబాలుని సోయగంబెన్న వశంబుగాకున్నదిగదా చుక్కల రాయని ధిక్కరించు చక్కనిముఖంబుగల యీచిన్నికుమారుని వన్నెచిన్నెలాకొన్ని లజాల్పెటుల నిర్మించినాడో కాని తెలి యదు (అని చెంచుస్త్రీలతో) అక్కలారా యీ చక్కనిబాలు నిజాడుడు మెంతసౌందర్యంబుగా నున్నడు॥

చెంచుస్త్రీలు.

వ॥ అవును గదనమ్మా! యీయందకాని నిర్మించి బ్రహ్మనేర్పరిగదా! అయినా యీపిల్లని నామంబేమో నిర్ణాణించుము తల్లివాక్యము దైవవాక్యమని పెద్దలు జెప్పగవింటుము గదా॥

♦ గిరిజావతి ♦

వ॥ మంచిది! అక్కలారా॥

గీ॥ శివకటాక్షంబువలన సెయవనియందు। జననమొందెనుగాన యీ చంటివాని। శివకుమారుడయను సిద్ధముగను। నిర్ణయించితి పిలువ్రు డో నేలతలార॥

వ। అక్కలారా! యీయరణ్యంబులో శివకటాక్షమువలన జన్మించిన వాడుగాన యీబాలునిపేరు శివకుమారుడని నిర్ణయించిన దానను ఇదిమీకు సమ్మతమేన॥

చెంచు స్త్రీలు.

వ॥ గిరిజావతీ నీసమ్మతమే మాసమ్మతము ఇందులో వ్యతిరిక్తమున్నదా యీబాలుని శివకుమారుడనియే పిలిచెదము గాని వొకదినం ఒకయేడు బాలునిగా గనపడుచున్నడుగదా అబ్బా నీ వెంత దొడ్డది అయినా నిద్రజెందుచున్నట్లున్నడు పవళింపజేయుము చప్పుడు సేయక అవలకుబోదాముర మ్మా॥

♦ గిరిజావతి ♦

వ॥ అక్కలారా! మీరనువిధంబుననే యీ తోట్లపై పరుండబెట్టితిని అవలకు బోదాము వదంతు నిద్రించగలడు॥

చెంచు స్త్రీలు.

వ॥ సరి మంచిది గమ్మ (అని నిష్క్రమింతురు)

శివకుమారుడు ప్రవేశము.

దర్వు-యేకతాళము.

శివకుమారుడరా। ధరణిలో శిష్టమతుడనురా ॥శివ॥ శివశివయనిసంస్తవ మొనరించెటి। శివభక్తుడ సుస్థిరమానసుడను॥ ప్రవిమలాంగుడనురా। ధరణిలో పాపజితుడనురా ॥శివ॥౧॥ ధవళయశుండను ధర్మరతుండను' కువలయ నేత్రుడకు ముదాప్తాస్యుడ నవనయాన్వితుడా। ధరణిలో। సకలజనహితుడా॥

వ॥ చల్లనిపెద మెటుపల్లియు మాసతి। వల్లభునిక్షమది వరుసతో నమ్మియు। సల్లలితంబుగను భజింతును। యెల్లవిధంబునను ॥శివ॥

వ॥ ఒహో॥ శివనామామృతమెంత మధురముగానున్నది। అందుకే। శివభక్తాగ్రేసరులెల్లరీ నామామృతంబునుంగ్రోలి। యానందింతురు (అని అనునంతలో)

చెంచుస్త్రీలు వచ్చిచూచి

వ॥ అబ్బా। యీబాలుండేమోకాని। దినదినంబు చంద్రకళలం బోలె వృద్ధిబొందుచున్నాడే ।అబ్బా। దైవకటాక్షం బెంతదొడ్డది (అ బాలునుద్దేశించి) వత్సా! శివకుమారా ఇటొకసారివినుము

శివ కుమారుడు

వ॥ తల్లులారా! యేమికేలవు!

వాదము జల్వతాళము।

చెం। శివకుమారధీరా। సుస్థిరమతి సువిచారా ॥శివ॥ అవనిలో వేటా
డగ మేమరుగుదు మిపుడరుదెంతువ ।శివ।౧।

వ। శివకుమారా! మేము వేటలాడబోవుచున్నారము నీవు వచ్చెదవా
చెప్పుము॥

శివ। కువలయాక్షులారా। చెంచువరతల్లులారా ॥కు॥ ప్రవిమలముగ
మీతోనే బరతెంతునువనిగాంతును ॥కు॥౨॥

వ। తల్లులారా! మీరనువిధంబుననే యవ్వనాంతరంబునకువచ్చి చూచె
దను మీవేటా సంవిధానంబులు॥

చెం॥ మంచిది యిదేవనమూ। కేతెంచితిమిక ఘనముమూ ॥మంచి॥
యెంచకమృగములను మేముద్రుంచెదము వసించుమిచట ।మంచి।౩।

వ॥ శివకుమారా మనమిదే వనాంతరంబు జేరితిమి కావున నీవీ నిర్మల
స్థలంబున నీవృక్షచ్ఛాయ వసించియుండుము మేము మృగంబులం
ద్రుంచి మళ్ళీ నీవద్దికి వచ్చెదము॥

శివ॥ అంచిత పెదమెట్టు। పురియభవునిమదిమగుట్టా ॥అంచి॥ దింకచ
మరి మీరుకొండీ దిటముగ నేనిటనుండును ॥అంచి॥౪॥

వ॥ చెంచుతల్లులారా! మీరువేటాడి రండు నేనిచ్చటనే యుండువాడ

చెంచు స్త్రీలు.

వ॥ మంచిది మేమిదే పోయివచ్చెదము (అని నిష్క్రమింతురు)

నారదుడు ప్రవేశము.

దర్వు—ఆదితాళము.

శంభోమహాదేవా । దేవా ॥శంభో॥ కుంభినీరథా కుముదాప్తధ
రా । జంభభేది సప్తవనీయపదా ॥శంభో॥ ౧॥ పాతకహారణా పరమా
త్మ శివా । భూతపతేసర్వాతీతమహా ॥శంభో॥౨॥ చల్లని పెదమెటుపల్లీ
శ్వరహరా । ముల్లోకాధిప ముక్కంటుమహా ॥శంభో॥ ౩॥

వ॥ భగవన్ ।సర్వలోకశరణ్యా । పాహిమాం పాహిమాం (అని
తనలో) ఓహో! మాతాతకుమారుని కుమారుండా శివకుమారుండీ

నా ర దు డు.

వ॥ మంచిది శివకుమారా ఇటువినుము.

మ॥ వినుమోవత్సమదీయ సన్నిధితమా విల్లున్మహాయస్త్ర శ । స్త్ర నికాయంబును కొన్నిసాధనములున్ సందీప్తవ జ్రాయుధం । బును రత్నాంచితమౌ కిరీటమునునేరొప్పప్పున్ మహాక్షిప్రితో । వినుము న్నించిమొసంగితిన్ గొనుమిదో నీవిన్నియున్ భక్తితోన్॥

వ॥ శివకుమారా! నీబుద్ధివిశేషంబునకే నెంతో మెచ్చి నీయందనుగ్రహముగలవాడనై ఇదే రత్నకిరీటంబును వజ్రకవచంబును వజ్రాయుధంబును పరిగ్రహింపుము. చెంచుపల్లెలో జన్మించి శివకటాక్షంబున వృద్ధిఁబొందుచున్నాఁడే మంచిది యీతనిచే ముందుకొన్ని కార్యంబులు గాఁబోవుచున్నవి కావున తత్సహాయంబుగా నీతనికి కొన్ని రహస్యాంతరమంత్రసాధన వివిధోప పరికరంబులనిచ్చి యీతనినీలోకంబులో వృద్ధిబొందింప జేసెదగాక (అని సమీపించి ప్రకాశముగా) వత్సా! శివకుమారా జయంబగుగాక నేను నారదమహర్షిని నన్నుకటాక్షించ వచ్చితిని.

శి వ కు మా రు డు.

వ॥ అహాహా భగవన్ నారదమహాత్మా నమస్కరించెదను నీనిర్హేతుక జాయమానంబు నకే నెంతో సంతోషించితిని నాభాగ్యమెంత దొడ్డది భవత్సందర్శనమే మద్భవసాగరోద్ధారకము॥

యుధంబును అక్షయబాణంబులును విల్లును ఇంకా నానావిధంబులైన సాధనంబు లొసంగుచున్నవాడ నైకొనుము గైకొని యీలోకంబులో జయోన్నతుండవు గమ్ము పొమ్ము నీకిదియే శెలవు॥

శి వ కు మా రు డు.

వ॥ మహాప్రసాదము స్వామీ నమస్కరించెదను॥

నా ర దు డు.

వ॥ బాలకా! వర్ధిల్లుము వర్ధిల్లుము (అని నిష్క్రమించును)

చెంచుస్త్రీలు వచ్చిచూచి.

వ॥ శివకుమారా! యీఘనురాతి సాధనంబులు నీకెట్లు లభించినవి చెప్పుము॥

శి వ కు మా రు డు.

వ॥ చెంచుతల్లులారా! ఇప్పుడు విశ్వోత్తుక జాయమానుకడగు నారద మహర్షి వచ్చి యివన్నియు ననుగ్రహించి దీవించిపోయెనుగదా

చెం చు స్త్రీ లు

వ॥ ఆహాహా! శివకుమారా నీభాగ్యమెంతవొప్పది (అని అనుచున్నంత లో రెండుపులులు వచ్చినంజూచి) అబ్బో! యెచ్చటినుండియో రెండు వ్యాఘ్రంబులు మాపైకి వచ్చుచున్నవే మే మేడుగురమొక్కపెట్టిన బాణంబులు విడిచి యీపులులం ద్రుంచెదగాక (అని కిమ్మర)

మత్తకోకిలము.

మేము యేడ్గుర మొక్కపెట్టిన మేలి మింగలబాణముల్।
యీ మహాద్వయ పుష్టపైనము యేసియుందును మాడియుక్‌।
నీమహిమ మరిమాడు ప్రాణములెల్ల గాచుకొనుంటమే।
క్షేమమానిక వీటిపైనను శీఘ్రమేసితి మస్త్రమత్॥

( అని బాణప్రయోగముచేసిన తగుననందున )

వ॥ ఆహా! ఇదియేమి చిత్రము మేమేడ్గుర మొక్కసారి యేడుబాణంబులు వేసినంగాని తప్పించుకొని యీరెండు వాక్యఘ్రుంబులు మాపైకి వచ్చుచున్నవే ఇవ్విమమ్ములచంపేటట్టుగనేయున్నవి. అయ్యో ఇకమేమేమి సేయునుము (అని చింతిల్లు చున్నంత)

శివకుమారుడు (తనలో)

వ॥ అబ్బా యేమి ! వీరిపురుషార్థంబులు । ఇంత మందికూడా యీరెండువ్యాఘ్రములను ద్రుంచలైరి । నేనిట్లూరకున్న వీరినెల్ల చంపగలవు । కావున । నారదుండిచ్చినది వ్యాఘ్రాస్త్రంబున వీటిండ్రుంచెదగాక (అని వొక్కబాణంబున రెండుపులులంజంపినంత)

చెంచుస్త్రీలు (తమలో)

వ॥ అబ్బా! యేమి యీరండాకొమరుకు వొక్క దెబ్బకే రెండుపులులంచంపెగదా వీనిపురుషార్థంబెం తనవచ్చును (అనిప్రకాశముగా) శివకుమారా నీవెంత పురుషార్థివి గదా వొక్కదెబ్బకే రెండుపులులం పితిప॥

శివకుమారుడు.

వ॥ సరే సరే మీ యుపచారంబు జేయుచుంగంటిని రండా కొడుకెవ్వడు చెప్పుడు॥

చెంచు స్త్రీలు.

వ॥ లేదు నాయనా మాట స్వభావంబట్లు వచ్చెను నీవు పురుషార్థిగా గుటచేతనే మా ప్రాణంబులు దక్కినవి పులులు జచ్చినవి అయినా ఇందుండవలదు మీతల్లి సాన్నిధ్యము నకుంబోదము రమ్మా (అనిగిరిజావతి చేరి) గిరిజావతీ నీకుమారుడంత భాగ్యశాలి నారదునిచే యనేక సాధనంబులు వడసి రెండు పులులంజంపి మా ప్రాణంబులుగా పాడినడు॥

గిరిజావతి.

వ॥ అక్కలారా! ఇదంత మీ యుపకారమే (అని అనునంతలో)

శివకుమారుడు.

వ॥ అమ్మా! ఇటొకసారి నామాటవినుము॥

♦ గిరిజావతి ♦

వ॥ కుమారా! యేమిమాట॥

వాదము-జల్పతాళము.

శివ॥ అమ్మా మాజనకుడెచట సమ్మతితో నున్నడో నాకిమ్మగ ॥అ॥ యిమ్మగ। సత్యమ్మగ శీఘ్రమ్మగ నాతోవచించు ॥మమ్మా॥

వ॥ ఆమ్మా! మాతండ్రిగారెచ్చట నున్నరో చెప్పుము లేకయున్న నేనన్నోదకంబులు స్వీకరించను విన్నావా॥

గిరి॥ ముమ్మాటిటువినుము నాముద్దుతనయ। నీతండ్రి వనమ్మున ॥ము వనమ్మున కూపమ్మున। దిగి క్రిమ్మరటా లేదాయను ॥ము॥౧॥

వ॥ నాయనా! మీజనకుండగు తాతకుమారుండు నొక జలంబులుండే నూతిలోదిగి మరలరాడాయను అందులో యేమైనబో యేమో తెలియదు॥

శివ॥ ఆనూతెచటున్నదో కని యరుగుద మనమిపు డటకుపూనియు॥ అను॥ పూనియు। మనమేనియు। జనిమానాయనసట గండము॥

వ తల్లీ: మా జనకుండుపోయి దిగిన బావి యెచ్చటున్నదో కాని చూత
ముపమ్మా అంతలో మా జనకుని జాడదీయవచ్చును॥

గిరి: సూనా పైన మెట్టుపల్లి సూనాస్త్రీంతకుని నమ్మి మానుగ ॥సూనా॥
మానుగ। వనిలోనిగ। గల మూచూతర సెదనురమ్మా ॥సూనా॥౪।

వ॥ కుమారా! మీతండ్రిగారి యశ్వంబుపై నీవెక్కుము నా యశ్వం
బుపై నే నెక్కి యాకానకరిగి యానూతిజూపించెదను॥

శివకుమారుడు.

వ॥ మంచిది యశ్వంబుపై నెక్కి నాడ నీయశ్వంబుపై నీవెక్కుము పోద
ముపమ్మా।

◆ గి రి జా వ తి ◆

వ॥ సరి రారమ్మా (అని నూతిని సమీపించి. కుమారా! ఇదియే మీ
తండ్రిగారు దిగిన నూతి।

శివకుమారుడు.

వ॥ మంచిది! నీవీ గడ్డనుండుము। నేనీ బావిలోకి దిగి మా తండ్రిని వెదకి
కొని తెచ్చెదను (అని నూతిలోకి దిగుచున్నంత)

దొండరాక్షసుడు (తనలో)

వ॥ అబ్బా! యీ శివకుమారుండా శివకటాక్షంబున జన్మించి నారదోప
దేశంబువడసి మహాబలవంతుడై యున్నాడు వీనింజయించ వశం
బుగాదు వీడు నాకుశత్రుడు వీనిజే నేను హతంబవుట నిక్కము
అయినా ఇప్పుడు వీనిచేతులలో బోవన్నల నేనీ నేలబావ్యార
ములోపలికిబోయి దాగుండెదగాక (అని నిష్క్రమించును)

శివకుమారుడు వచ్చిచూచి తండ్రినిమరచి (తనలో)

వ॥ ఆహా! ఇదియేమియాశ్చర్యము యీభవనమెంత సౌందర్యంబుగా
నున్నది దీని నొకసారి వర్ణించు చూచెదను॥

దర్వు-రూపకము.

యీభవనము నెంచగ యీ మిందాద్రులకైన దరమ ॥యీభవ॥
యీభువిలో దీనితోసరి యీభవనముజూడనుభళి ॥యీభ॥౧॥
యెటుజూచిన ధనరాసులు దిటముగ ధాన్యపురాసులు ॥యెటు॥

ఇట్టిగృహంబును పెదమెట్టుపు॥శుడు స్వయముగ ॥ఇట్టి॥ ఘట్టిగ
నిర్మించబోలు ఘనచిత్రంబిది చూడగ ॥యీభ॥ 3॥

వ॥ సరి। మేమా గండారణ్యంబులోనుండి యీయాస పడనేల। యీసకల
సామగ్రి యుక్తంబగు యీయింటిలోనుండి సర్వసౌఖ్యంబు లను
భవింపుచు సుఖంబుగ నుండుట మేలుగాదా ఇందులకు మా
తల్లిని బోద్కొని వచ్చెదగాక (అని తల్లిని సమీపించి) అమ్మా
ఇచ్చట మహాశృంగారంబగు భవనంబున్నది। అందులో ధన ధా
న్యాది వస్తువు లనేకముగా నున్నవి కావున మన మందులో
నుందమురమ్మా యీ యడవిలో శ్రమపడనేల॥

♦ గి రి జా వ తి ♦

వ॥ కుమారా! ఇదియెవ్వరి గృహమోయేమో మన మిందుండిన నేమి
లాభము యెవ్వరేమందురో కదా॥

శివకుమారుడు.

వ। తల్లీ నేనుండగ నీకేమిభయము నీవీగృహంబున నుండుము నేనా
చెంచుతల్లును దోడ్కొని వచ్చెదను॥

♦ గి రి జా వ తి ♦

వ। కుమారా! నీకట్లున్న యెడల నేనిచ్చటనే యుండెదను పోమ్మా
చెంచుస్త్రీలను దోడ్కొని రమ్మా॥

శివకుమారుడు.

వ॥ సరి! నేబోవుచున్నవాడ (అని నిష్క్రమించును) (అంత)

దొండరాక్షసుడు (తనలో)

వ॥ ఆహా! ఇది మంచి సమయము శివకుమ రుండా చెంచులకై వెళ్ళె
నేప్పుడా తాతకుమ రుని స్వరూపంబున గిరిజావతిదగ్గరికి వానిం
జంపించు నుపాయంబును బన్ని స్త్రీయాగిరిజావతితో సుఖంబుగ
నుండెదగాక (అని తాత కుమ రుని స్వరూపంబుదాల్చి గిరిజా
వతిని సమీపించినంత॥

గిరిజావతి భర్తగాభావించి.

వ॥ నాథా నమస్కరించెదను॥

దోండరాక్షసుడు.

వ. మనోహరీ! వర్ధిల్లుము! వర్ధిల్లుము!

వాదము-అటతాళము.

గిరి॥ మనోనాయకా నీకు మర్యాద యౌనే। వనుంబాసియుండ నింకున నుండగానే ॥మనో॥౧॥

వ॥ నాథా! నన్నొంటరిగా విడనాడి నీవీ బావిలోనుండ మర్యాదగునా నిన్నుబాసిన నాకేదిక్కు॥

దొం। మనోనాయకీ నేనేమని విన్నవింతు ఘనంబీవిధంబాయెగా నాకు వంతు ॥మనో॥౨॥

వ॥ గిరిజావతీ మనకుమారుండగు శివకుమారుండుంబేయ నాకింతగతి వచ్చినది అదెట్లనగ నాకు పీడుశతృడు పీనిభయంబుచేకే నిన్నువిడనాడి యీబావిలో దాగుంటినిగదా.

గిరి॥ అయోనాథ నీకింత అయాసమెటుచ్చె దయాహీనుడైయిట్లు దైవంబుడెచ్చె ॥అయో॥౩॥

వ॥ అయ్యో! మనోహరా మనకుమారుని వలన నీకింత శ్రమసంభవించివచ్చెనా దైవంబిందులకుతోడై నాకు నీకెడబాటు గల్పించి యింత కష్టముల పాల్జేసెను అయినా భర్తలేనినా బ్రతుకువ్యర్థమేకదా ఇందుమీద మీరెట్లు చెప్పినసట్లు జేసెదను పతియాజ్ఞమెలంగుటపతివ్రతలకు ధర్మమేకదా॥

దొం॥ పయోజాక్షీ పెదమెట్టుపల్లీశుయాన వయంబౌ విధానంబువచియింతుగాన ॥పయో॥౪॥

వ॥ గిరిజావతీ నీకునాయందు ప్రేమయున్న యెడల నేజెప్పినట్లొనర్చెదవని చెప్పెదను ఇటువిమను పీకుమరణంబైనచో మనము సుఖస్థితిగానుండవచ్చును లేనియెడో నేనచ్చటనే నీవిచ్చటనే॥

గిరిజావతి

వ॥ మనోహరా! నీకంటె నాకెవ్వరేమున్నది నీవెట్లు జెప్పినట్లు జేసెదను.

దొండరాక్షసుడు.

లేచినదనిపదుకుండుము అప్పుడువాడు నిన్నుజూచి యిదియేమియని యడిగిన నాకు తలనొప్పిలేచినది యీతలబాధ బోవుటకు నాస్వ ప్నమందుమునులువచ్చి చెప్పినారుగదా జంగిలిగోసాలు మఠము లోబానిమ్మ చెట్టున్నది ఆచెట్టుకు అరుసైయూరు ఫలంబులున్నవి అందులో అయిదుఫలంబులు దెచ్చియిస్తివా నాతలనొప్పిమానునని మునులు చెప్పినారని చెప్పుము వాడవ్వేటకుబోయి యచ్చటనే మరణిం చగలడు అప్పుడు మనము సుఖంబుగ నుండవచ్చునుగదా యీయుపా యంబు జేయుము॥

గి రి జా వ తి.

వ॥ చిత్తము నాథా! నీవన్నట్టులనే జేసెదను పోదముపదండు॥

దొం డ రా క్ష సు డు.

వ॥ రారమ్మ పోదము (అని నిష్క్రమింతురు.)

శివకుమారుడం చెంచులసమీపించి.

వ॥ చెంచుతల్లులారా! ఇటొకసారి నామాట వినుడు॥

చెంచు స్త్రీలు.

వ॥ నాయనా! శివకుమారా యేమిమాట॥

శి వ కు మా రు డు.

వ॥ తల్లులారా! మనమీవనాతరంబులో నుండి శ్రమపడనేల దైవకటాక్షంబున నిచ్చటనొక్క గృహంబుదొరెకినది అందులోనవ ధాన్యములు పుష్కలముగానున్నవి మనమందుండి సుఖింతమురండు॥ పోదము॥

చె ం చు స్త్రీ లు.

వ॥ నాయనా మేముచెంచువాలలము మేమీవనమందుండు వారముగా ని గృహంబులందుండు వారముగాము మేమిచ్చటనే యుండెదము మీరు రాచవారలు కావున మీతల్లి నీవుయిద్దరు యాగృహంబు నందుండి సర్వసౌఖ్యంబులను భవింపుచు దీర్ఘాయుష్మంతులై బ్రతు కుపొండి నీకిదియే శెలవు॥

శి వ కు మా రు డు.

వ॥ చిత్తము తల్లులారా! మీయాజ్ఞదొలంగెదము (అనితల్లిని సమీపిం

ది పడుకున్న తల్లినిజూచి) అమ్మా! నీవేమోచాల ఆయాసముచే పడుకున్నట్లున్నవు కారణంబేమి.

గిరిజావతి.

వ॥ కుమారా! నేనేమి చెప్పుదు నాకనేకముగా తలనొప్పిలేచి నది యెవ్వరిదో యీగృహము ఇందుండవలదని నేనెంత జెప్పిన వినక నన్నిందుంచిపోయితివి నీవుపోయిననుండి నాకిదియేయవస్థ॥

శివకుమారుడు.

వ॥ అయ్యో తల్లీ! నీకింతశ్రమవాటిల్లినదా దీనికిందగు యౌషధమే మో నాకుందెలియదుగదా తెలిసినను తెచ్చిపెట్టుదును.

గిరిజావతి.

వ॥ కుమారా అట్లైన నేనొకటి జెప్పెద నిటువినుము.

ఉ॥ నాదగుస్వప్నమందుముని నాథులు వచ్చియు చెప్పిరిట్లుహో నాకు
కుమార జంగిలి మహాముని సన్మఠమందు సర్వదార్వాదుగనిమ్మవృం
డ్లుగలవందులో నైదు ఫలంబులైననీ బాధదొలంగునంచనిరి బాగు
గనవ్వియు దొర్కమేలగుగ॥

వ॥ కుమారా! జంగిలిగోసాయి మఠములో దానిమ్మచెట్టు కరువదాదు ఫలంబులున్నవట అందులో నైదుఫలంబులు దొరికినట్లు తేనీతల నొప్పిమానునని నాస్వప్నమందుమునులు చెప్పినారు అవిలభించిన బాగుండునుగదా నాతలనొప్పిమానును లేకయున్న నే బ్రతుకజాల ను॥

శివకుమారుడు.

వ॥ తల్లీ నీకీతాపమెందుకు! నేనా ఫలంబులందెచ్చెదను నీవిచ్చటనే యుండుము॥

గిరిజావతి

వ॥ మంచిది కుమారా శీఘ్రంబునంబోయి శీఘ్రంబునరమ్మ అలస్యంబు వలదు.

శివకుమడు.

వ॥ చిత్తము తల్లీ ఇదో నేబోవు చున్నవాడ (అని నిష్క్రమించును)

దొండరాక్షసుడు మ యదూపకమగావచ్చి గిరిజావతితో.
వ॥ తరుణీ నేజెప్పినట్లు చేసితివాలేదా!

గి రి జా వ తి.

వ॥ నాథా! నీవన్నటులనే మనకుమారునా దానిమ్మపండ్లకై తోలించినదానను.

దొం డ రా క్ష సు డు.

వ॥ మంచిది వాడచ్చట మరణము కాగలదు కాని మనమిద్దరమీభవనాంతరంబులో సుఖంబుగ నుందము రమ్ము॥

గి రి జా వ తి.

వ॥ చిత్తము నాథా! అటులనే యుందము పదమ్ము (అనినిష్క్రమింతురు)

శివకుమారుడు (తనలో)

వ॥ ఆహా! మాతల్లియను మతంబున నేనాజంబీలిగోసాయి మతమునకు బోవుచుంటిని గాని, నేనింత దూరమొచ్చుటచే నాగురి మలసియున్నది. కావున యీవటావృక్షము క్రింద కొంత విశ్రమించి పోయెదగాక (అని యొక మర్రిచెట్టు క్రింద విశ్రమించి యున్నంత ఆ చెట్టుమీద గూటిలోనున్న గరుడపక్షి పిల్లలను భక్షించుటకై ఆదిశేషుడా వృక్షమును నెక్కబోవుచున్నం జూచి) అహా! ఇదియేమి యాశ్చర్యము యీవటావృక్షముపైనున్న గరుడపక్షి పిల్లలను భక్షించుటకై ఆదిశేషుండీ చెట్టుపై నెక్కుచున్నాడే పాపము ఆ పిల్లలెంతరోదనంబు జేయుచున్నవి మంచిది నేనీ వజ్రాయుధంబున యీ పామును ఖండించి యీపక్షిపిల్లలను రక్షించెదగాక (అని వజ్రాయుధంబున సర్పమును ఖండించియున్నంత)

గరుడపక్షులు ప్రవేశించి,

వ॥ ఓహో! మేమా దేవేంద్ర లోకంబునకేగి మాపిల్లలకు మేతదెచ్చితిమి కావున యీమేత మాపిల్లల కొసంగెదముగాక (అని పిల్లలంజేరి) బిడ్డలారా! మీరీ యీయాహారం బనుభవించుడు:

పి ల్ల లు.

వ॥ ఓహో మీరెక్కడి తలిదండ్రులు, మే మెక్కడి బిడ్డలము మీకు

మాకేమి సంబంధము లేదు. మీరు లేని యడల మమ్ముల జంపుటకై వచ్చు యీసర్పరాజమును జంపి మా ప్రాణములు గాపాడిన తండ్రి యదిగో యీవృక్షము క్రింద నున్నాడు చూడుడు అయినా మా ప్రాణంబులున్న పర్యంతరమాతని సేవ జేసెదమని మాకభయం బిచ్చినమీరు దెచ్చినమేత లారగించెదము లేకయున్న మాకేమియుం బట్టవు॥

గరుడపక్షులు (తమలో)

వ॥ అవును నిజమేకదా చంపినది యీసర్పఖండంబులు రెండచ్చటనున్నవి మంచిది (అని ప్రకాశముగా) బిడ్డలారా! మీమనో సమ్మతిగనే యీపురుషునికి మాజీవము లున్నంతవరకు సేనజేసెదముఇదోయభయంబిచ్చితిమి గైకొని మీరీ మేత లారగింపుడు.

పి ల్ల లు.

వ॥ మంచిది జననీ జనకులారా! ఇప్పుడుగదా మామది సంతోషమైనది మీరుందెచ్చిన యాహార మనుభవించెదము ఇటుదెండు.

గ రు డ ప క్షు లు.

వ॥ ఇదో గైకొనుడు (అని యొసంగిన మెసంగియున్నంత శివకుమారుని సమీపించి) అయ్యా మహనీయా?

వాదము—యేకతాళము.

గరు॥ యెవరయ్యా మీరూ యెరిగించుడిందునూ ॥యెవ॥ అవిరళముగను నీవిటనూ అరుదెంచు టెందుకు । వివరించుమీ మాకు విశదంబుగానూ ॥యెవ॥ ౧॥

వ॥ అయ్యా! మీరెవ్వరోకాని మాబిడ్డల ప్రాణములుగాపాడిన పరమపుణ్యాత్ముల రగుమీ నామధేయమేమో చెప్పి మావీనులకు విందొనర్పుము మేమెవ్వరనుకున్నావు గరుడపక్షులము గదా॥

శివ॥ సువివేకులారనే వివరింతు వీచుడీ ॥ సు॥ అవనిలో గిరిజావతి మాయమ్మ నానామమూ । శివకుమారుండ నీక్షితి బిస్తురందరూ॥ సువి॥ ౨॥

వ॥ గరుడపక్షులారా! నేను రాచకుమారుండనగు శివకుమారుండను నామంబుగలవాడను మాతల్లి గిరిజావతి యామెకు తలనొప్పి లేచినందున మాతల్లి స్వప్నమందు మునులువచ్చి చెప్పిరిగదా జంగిలి

గోసాయి మఠములో దానిమ్మపండ్లున్నవి యందులో అయిను పండ్లు దొరికిన నీతలనొప్పి మానునని మునులన్నిందున నేనాఫలంబులకై వచ్చితిని గదా॥

గరు॥ అహాహా యీ మాటయూ అతిచిత్రమో నృపా ॥అహా॥ సహజము నవిదే నెవరిసాధ్యంబునౌనుయీ మహీనచట్టు కేగిన మరణమే ఘటించుగా॥ అహా॥౩॥

వ॥ శివకుమారా! నీకీపనిచెప్పినవారు శత్రులేకాని మిత్రులుగారు అదెటులన జంగిలిగోసాయి మఠములో దానిమ్మచెట్టున్న మాటనిజమే! కాని దాసిపండ్లు దేవతలు గొంపోయెదరని యాగోసాయి కొమ్మకొమ్మకు కోటరాక్షసుల కావలియుంచినాడు కావున అచ్చటికిబోయినవారు మళ్ళివచ్చుటబద్ధము ఆరాక్షసులు చంపగలరు యీపని మహాయసాధ్యముగదా॥

శివ॥ విహగాగ్రగణ్యులు వినుడినావాక్కులు ॥విహ॥ మహిని పెదమెట్టుపల్లీ మహాదేవుడేగతి। విహితముగ నవిలేనిదీ వేంచేయనింటకీ ॥విహ॥౪॥

వ। గరుడపక్షులారా యెంతకష్టమైన యెంతనిష్ఠూరమైన నేనాపండ్లుగ్రహించనిది యింటికిపోజాలను పోయి మాతల్లిశ్రమనుజూచి భరింపజాలను॥

గ రు డ ప క్షు లు

వ॥ మంచిది శివకుమారా! నీకట్లున్నయెడల మేమొక యుపాయంబు జెప్పెదము విను॥

సీ। శివకుమారవినుము సిద్ధంబుగనునీవు మరిజంగ్లిగోసాయి మఠసమీప।
మందులోకోశ్వరస్వామి దేవాలయమున్న దందులింగమూర్తి పూజ।
సలిపి తత్పత్రిపుష్పములెల్లగ్రహియించి మరిజంగ్లిగోసాయి మఠము
కేగి। నీ వెక్కుగురిగంబు నికదెబ్బవేయుము యేసినయోజనమేగల
పైకి నపుడు నైదుఫలంబుల నందుకొనియు। పిదప నొకదెబ్బవేయగ నదియుపురల। యోజనముక్రింద దిగునపుడునుగ్రరాక్ష।
సులునువత్తురు వచ్చినసూనపత్రి బయమునుజల్లుముచల్లినజత్తురంత॥

వ॥ కావున పైనజెప్పిన విధంబునంజేసి యూమైన ఫలంబులం దీసికొనిరమ్ము పొమ్ము మేము నీవెంటనేయుండెదము॥

శివ కుమారుడు

వ॥ గరుడ పక్షులారా మహోపకారులగు మీవాక్యంబు చెప్పు దపక నేనాపని గావించుకొనివచ్చెదను తొందరేమి॥

గ రు డ ప క్షు లు

వ॥ పొమ్ము జయంబుగొనిరమ్ము

శివ కుమారుడు

వ॥ ఇదో నేబోయెదను అనిపోయి పక్షులుజెప్పినక్రమంబునం జేసి ఫలంబుల గ్రహించికొనివచ్చు నెడకాకులవలె రాక్షసుల డ్రింబై నంజూచి ఓహో నేనాగరుడపక్షుల వాక్యానుసారంబుగజేసి యీ మైదు దానిమ్మఫలంబులం దీసుకొనివచ్చునెడ యీరాక్షసులు కాకుల వలె మూగియున్నారుగదా మంచిది॥

మత్త కోకిలములు

నేనుయీశివుపూజజేసిన నేటుప్రితిసుమంబులన్ మానికన్నిటువ చ్చురాక్షస మండలంబులపైనిబల్ పూనిజల్లియు వీరినెల్లను పూర్తి దన్ వధియించినా స్థానముగ్నికజేరబోదును తక్షణంబుననేడికన్॥

వ॥ భీ రాక్షసాధములారా మధియుడు ఇదేమీపైకి ప్రతిపు మంబులన్ । మానకన్నిటువచ్చు రాక్షసమండలంబులపై నిబల్। పూ నిజల్లియు వీరినెల్లను పూర్తిగన్వధియించినా । స్థానముగ్ నికజేరబో దును తక్షణంబుననే డికన్।

వ॥ భీ॥ రాక్షసాధములారా మడియుదు ఇదేమా పైకి ప్రతి పుష్పంబు లాజల్లుచున్నవాడ .అని ప్రతి పుష్పంబులంజల్లినంత రాక్షసు లు జచ్చినంజూచి) సరి యీరాక్షసులంత మృతింబైరి నేవచ్చి నపని సఫలంబైనది నేనాగరుడ పక్షులసన్నిధి కేగెదగాక (అని పక్షులంజేరి) గరుడపక్షులారా! మీరను విధంబునంజేసి ఫలం

గ రు డ ప క్షు లు.

వ॥ అహాహా శివకుమారా! నీవంటి సాహాసుని మేమెచ్చట జూడలేదు సరి పోయిరమ్ము నీవెప్పుడు దలచినప్పుడు వచ్చి నీకెట్టి యాపత్తులైన మేము దీర్చగలము ఇదేయీమాటనమ్మి నీ గృహంబున కేగుము!

శి వ కు మా రు డు.

వ॥ మంచిది పక్షులారా! ఇదో నేబోయెదను ( అని నిష్క్రమించును)

దొం డ రా క్ష సు డు (తనలో)

వ॥ అహా! ఇది యేమివింత నేనుజేసిన యుపాయుంబునకా శివ కుమారుండు చావక మరల వచ్చుచున్నాడే ఇగయెట్లు యెట్లేమున్నది యింకా ప్రియత్నించి చూచెదను (అని గిరిజావతితో ప్రకాశముగా) తరుణీ ఇగనేనిచ్చటుండజాలను యెచ్చటికైన బోయెదను.

గి రి జా వ తి.

వ॥ అహాహా నాథా! ఇది యేమన్యాయము.

వాదము — రూపకము.

గిరి॥ హృదయేశ్వరా! ఇదియే మన్యాయంబున్నుబాసి పోవుట ॥హృ॥
వ॥ నీవన్నవిధంబుననే మన కుమారుని నాదానిమ్మపంక్తకై తోలించితిని వాడచ్చట మరణించవచ్చును యిగ తొందరేమి మళ్ళినన్ను విడనాడిపోతననుట మర్యాదేనా॥

యేకతాళము.

దొం॥ సుదతిరో। సుదతిరో పదపడి నావాక్యమొకటి పరగవినుము చెల్వెదవో॥ సుద॥ కుదురుగమన శివకుమారుడదోవచ్చెను మృతముగాక। అదికారణముగను నేను అరుగుదెచటికైద నిపుడు॥సు॥౨॥
వ॥ నారీ! మనమెంత ప్రియత్నించినను మనకుమారుండు చావక మరల వచ్చుచున్నాడు కావున అందుకొరకే నేనింకుండు నవసరము లేదు యెచ్చటికైనబోయెదను వాడు నాకు శత్రుండని ముందే వచించితినిగదా॥
గిరి॥ సరేమంచిదీ। మరియేవిధమూ। మరణమానో వాడు తెలుపుడీ॥ సరె॥ విరివిగ మీారన్నమాడ్కి। వేగనేనుజేతు నాయక॥ సరె॥ ౩॥

వ॥ నాథా! వాడుచావచట్టయితే యింకా యేవిధంబున జచ్చునో చెప్పు డు నావిధంబున జేసెదను మీయాజ్ఞమీారుకునా।

ద్వి॥ తరుణిరో! తరుణిరో। మరినేజెప్పిన ధమున కరముకునుగా ననిచె దవా ।తరు। ధరణిని పెదమెట్టుపల్లి ధామును శశికంఠసాక్షి వర కుమారుడను హతమాసరణియు వాసుశ్రీత్తవినుము ।తరు।౪।

వ। నారీ! యీశివకుమారుండు జచ్చుయుపాయం బింకొకటి గలదు అది జెప్పెదనిటు వినుము॥

పంచపాది.

చ॥ పకపక నవ్వితేత్ తమలపాకులు రాలవలెన్ మరిన్ మరిం ♦ కొక పరిమాటలాడితేను పోకలురాలవలెన్ ♦ పురాణశాస్త్ర కథలు జదివితేత్ మరియు జక్కగకాచును రాలగావలెన్ ♦ గకవిక కన్ను గారగ సున్నముగా గావలెన్ స్వతం ♦ తిరిక మివి నాల్గువస్తువులు దెమ్మను తేజనిచ్చు నచ్చటన్॥

వ॥ గిరిజావతీ! మళ్ళినీవప్పటి వలెనే పండుకొనియుండుము వాడొచ్చి యిదియేమి యనియడుగగా నాయనా యీపండ్లతో నాకొప్పి మానదు యింకొకయౌషధము జెప్పితిగదా పకపకనవ్వితేతమ్మ లపాకులు రాలవలె మాట్లాడితే పోకలురావలె శాస్త్రపు రాణాలు జదివితే కాచురాలవలె కన్నుల వుదకమువస్తె సున్న ముగావలె యీనాలుగు వస్తువులు యేడు సముద్రములావల నున్నావట। యీవస్తువులు దెచ్చినాకిచ్చినయీనొప్పిమానును అని చెప్పుడు వాడీవస్తువులకైబోయి యేసముద్రములోనైన బడి చావగలడు మనము మంచిగుండవచ్చునుగదా అయినా నిదే నేలబాయ్యారములో దాగుండెదగాక॥

♦ గి రి జా వ తి ♦

వ। నాథా! అట్టులనే జేసెదను సందేహమేమి మీారై తేపొందు (అని యెప్పటివలె పరుండియున్నంత)

శివకుమారుడు వచ్చి.

వ। తల్లీ! లెమ్ము! లెమ్ము! ఇదో దానిమ్మపండ్లు దెచ్చినవాడను వీటిచే తలబాధ మాన్పుకొమ్ము (అని యిచ్చును)

◆ గి రి జా వ తి ◆

వ॥ నాయనా! శివకుమారా! నేనేమిసేతురా తండ్రి యీదామ్మపండ్లచే నాకారోగ్యము కాన్పట్టులున్నది యింకొకయూషధబా మునులుచెప్పిరి అదెట్టిదన పకపకనవ్వితె తమలపాకులు రాలవలె మాట్లాడితె పోకలురాలవలె శాస్త్రపురాణాలు చదివితె కాచురాలవలె కన్నులకునీరువస్తె సున్నమురాలవలె యీనాలుగువస్తువులు తీసుకవస్తివా నారోగముమానును లేకయున్నను నేను బ్రతుకను ఇవి సప్తసముద్రము లావలనున్నవట॥

వ॥ ఓహో తల్లీ! ఇంతియేనా యీనాల్గువస్తువులుం దెచ్చెదను తొందరొందకుము ఇదేనేబోయెద శలవిమ్ము॥

◆ గి రి జా వ తి ◆

వ॥ కుమారా! వేగిరంబునంబోయి వేగిరంబునరమ్ము ఆలస్యంబువలదు

శివకుమారుడు.

వ॥ మంచిది నేనిదే బోవుచున్నవాడ (అని నిష్క్రమించును)

దొండరాక్షసుడు మాయరూపముతో.

వ॥ తరుణీ! గిరిజావతీ నేజెప్పినట్లు జేసితివా లేదా॥

◆ గి రి జా వ తి ◆

వ॥ నాథా! నీవట్టులనే నాలుగువస్తువులకై మన శివకుమారు నాసప్త సముద్రము లావలికి వెళ్ళించినాను నీయాజ్ఞమీరుదునా॥

దొండరాక్షసుడు.

వ॥ మంచిది! రారమ్ము మనము సుఖంబుగా నుందము॥

◆ గి రి జా వ తి ◆

వ॥ సరి పోదమ్ము (అని నిష్క్రమింతురు) (అంత)

శివకుమారుడు (తనలో)

వ॥ ఓహో! మజ్జననీయనుమంబున నాలుగువస్తువులకై వెళ్ళి యీ లవణసాగరంబుం జేరితిని గాని యీయుశ్వం బీయేడు సముద్రంబులు దాటే అట్టులేదు గదా ఇక నేనేమిసేయుదు హాసర్వేశ్వరా! శంకరా (అని శివస్తుతిని జేయును)

దర్వు-ఆటతాళము.

శ్రీగౌరిలోలా। శ్రితభక్తపాలా। యోగానుకూలా । మోసత్య
శీలా ॥శ్రీగౌ॥ నాపాలిదేవా। నతమానిజీవా। యీపట్లరావా
యికనన్ను బ్రోవా ॥శ్రీగౌ॥౨॥ సదయాత్మభారీ। సకలాత్మ
చారీ॥ పెదమెట్టుపౌరీ। సదనాబ్జధారీ ॥శ్రీగౌరి॥ ౩॥

వ॥ దేవా పరంధామ ఈసమయమున రక్షించ నీదేభారమురా తండ్రీ
(అని యోచించి) ఆహా! నాయాపత్కాల బాంధవులను గరుడ
పక్షులుండెనుగదా నాటిందలంచెదగాక వాటిచే మత్కార్యం
బునెరవేరగలదు (అని గరుడపక్షుల నుద్దేశించి హే గరుడపక్షు
లారా! రండు నాయాపత్తు నివారించుడు (అని దలంచనంత)

గరుడపక్షులు ప్రవేశించి.

వ॥ ఆహాహా! శివకుమారా మమ్ముల దలంచిన కారణంబేమి శ్రుతపర
చుము నీకెట్టివిపత్తులైన మేము దీర్చగలము॥

శివకుమారుడు.

వ॥ తార్క్ష్యపుంగవులారా! ఇటువినుండు॥

క॥ మాజనని నాల్గువస్తు ♦ లీజగతిని
గోరెనవ్వి యిపుడుండేగక ♦ నేజనుదెంచితి
నీ జలధులు దాటలేక ♦ నిటనుంటి నిక॥

వ॥ గరుడపక్షులారా! మాతల్లికి నాలుగు వస్తువులు కావలసి యుండి
యింతపర్యంతరము వచ్చితి ఆవెట్టివనిన పకపక నవ్వితే తమల
పాకులురాలవలె కన్నులనీరు సున్నముగావలె శాస్త్రపురాణా
లుచదివితె కాచురాలవలె కన్నులనీరు సున్నముగావలె ఈనా
లుగు వస్తువు లీసప్తసముద్రము లావలదున్నవట అందుకొరకై
వచ్చి ఈ సముద్రములు దాటవశముగా మిమ్ముల దలంచితిని
గదా దీనికేమి యుపమ॥

గరుడపక్షులు.

వ॥ యుపమేమున్నది మారెక్కలపై నెక్కుము నిన్నీ సప్తసముద్రం
బులు దాటించెదము।

శివకుమారుడు.

వ॥ సరి అలాగే మొక్కితిని పో పదుండు॥

గరుడపక్షులు.

వ॥ రారమ్మా! పోదము (అని రెక్కలపై నెక్కించుకొని సప్తసముద్రంబులు దాటియున్నంత)

సిద్ధుడను మునీశ్వరుని ప్రవేశము.

దరువు-యేకతాళము.

సిద్ధుడనె ప్రసిద్ధుడనె ప్రసిద్ధుడనె సబుద్ధుడనె। బద్ధమానసుండపకాని వృద్ధశ్రీవనుండ ఘనుడ ॥సిద్ధు॥౧॥ ఆరూఢిగ నష్టాంగయోగములు నభ్యసించినట్టి వాడబలే। వైరిషట్కమును బారద్రోలి సంసారతపమున్నిష్ఠారతి జేసెటి ॥సిద్ధు॥౨॥ పుట్టిగ శ్రీ పెదమెట్టుపల్లి తరిగట్టిదాశరునట్టిమహిమ॥ పట్టువిడక సంప్రస్తుతి జేసెది దిట్టమలస్కుడదివ్య పురుషుడను ॥సిద్ధుడనె॥౩॥

వ॥ ఓహో! నేనా సదాశివుంగురించి సదా యెల్లప్పుడీ సముద్రతీరమందు తపస్సు చేయుచుండు తపోధనుండునగు సిద్ధుడను మునీశ్వరుండను (అని బాగావీక్షించి) అదిగో గరుడారూఢుండై వచ్చుచున్నాడే మంచిది రానిమ్ము (అని అనునంతలో శివకుమారుండు వచ్చినంజూచి) ఆహాహా! బాలకా!

వాదము-యేకతాళము,

సిద్ధు॥ నీవెవ్వరో తెల్పు మీ బాలకా ॥నీవె॥ భావింప నీవింబరతెంచు పనియేమి। వేవేగ నాతోడ వినజేయుమావార్త ॥నీవె॥౧॥

వ॥ బాలకా! నీవెవ్వరు నీనామధేయంబేమి నరమాత్రుండవగు నీవీ సప్తసముద్రంబులుదాటి యిచ్చటికి వచ్చినకారణంబేమి నీస్థితిగతులంత విన్నవించుము నేను సిద్ధుండను మునుండనుగదా॥

శివకుమారుడు.

వ॥ ఆహాహా! మునిసత్తమా నమస్కరించెదను॥

సిద్ధుడు.

వ॥ వత్సా! శుభంబగుగాక॥

శివకుమారుడు.

ప॥ ఆర్యా! నాస్థితిగతులు వినుండు।
ధీవీరగణోత్తమా। మానివర ధీవే। పాపీణ్యాగరాచ బాలుండ
పీలుండ। శ్రీవెలయు నాపేరు శివకుమారుడండ్రు ॥ధీ॥౨॥

వ॥ మునీంద్రమా! నాపేరు శివకుమారుండను ధర్మరాజు పౌత్రుండను తాతకుమారుని పుత్రుండను నేనొక కార్యంబునుగురించి ఇంత దూరమొచ్చితినిగదా॥

సిద్ధుడు.

వ॥ మేమీ! నీవా ధర్మరాజు పౌత్రుండవగు శివకుమారుండవా సరి మంచిది (అని తనలో యీతడా పూర్వజన్మమందు నొగురు పుత్రుండై క్షీరసాగర సమీపంబున తపంబుజేయుచుండ అంత మార్గంబునం బోవుగంధర్వస్త్రీలనుజూచి మోహించి వారిచే సర్వసౌఖ్యంబు లనుభవించి తద్వాసనా వశంబున భూలోకమం దివ్వాడు శివకుమారుండై జన్మించినాడు కావున తత్కారణం బున నీతనికి వివాహంబుంచేసి బుత్తెంచిన బాగుండునుగదా! అయినా నీతని స్థితిగతి లేమో పూర్తిగ తెలిసికొనియెదగాక (అని ప్రకాశముగా) బాలకా॥
యేకార్యమును గూర్చియున్ ॥ వచ్చితి ॥ వేకా॥ సాకల్యముగ నాతో సకలంబు వచియించు। నీకోర్కులు దీర్చి నేబుత్తు నిన్ని పుడు ॥యేకా॥ ౩॥

వ॥ శివకుమారా! నీవేపని గురించి యింతదూర మొచ్చితివో చెప్పుము పే నాపని నిర్విఘ్నంబుగా నెరవేర్చి పంపెదను అదియునుం గాక నీకు వివాహంబుకూడా జేసియుంబంప వలెనని నామనో త్సాహంబు గలుగుచున్నది।

శివ॥ వోకారుణ్యోత్తమా! మానివర ॥వోకా॥ మాకన్నతల్లికై మరి యిందు రావలలె। ప్రాకటపెదమెట్టుపల్లీశ్వరునినమ్మి ॥లోకా॥ ౪!

వ॥ స్వామీ! మాతల్లియగు గిరిజావతికి తలనొప్పి లేచినందున నొక యౌషధమునకై యిచ్చట కొచ్చితి అదెట్టిదన పకపకనవ్వితె తమ్మలపాకులు రాలవలె మాట్లాడితె పోకలురాలవలె శాస్త్ర

పురాణాలు చదివితే కాచురాలవలె కంటిలో వుదనము సున్న ముగావలె యీనాలుగు వస్తువులకై వచ్చితిని కావున యీ వస్తువులిప్పించి నన్ను బుత్తెంచుము ఇదియే నేవచ్చు కార్యము॥

సిద్ధుడు.

వ॥ మంచిది! శివకుమారా యీ నాలుగు వస్తువులుం దొరికే యుపాయంబుం జెప్పెదను గాని నీవైతే వివాహంబుం జేసికొనియెదవా లేదా చెప్పుము॥

వ॥ స్వామీ! మీచిత్తము॥

సిద్ధుడు.

వ॥ అట్లులైననే నొకటి జెప్పెద నిటు వినుము॥

సీ॥ వినుము శివకుమార విశదంబుగను। నిచటికి నియోజనము దూరనను సప్తకోలనులు గలవట గొనకొని గన్నేరు। పొదలున్నవచట శేషాద్రిగ్రనిందు। పుత్రికలేగ్గరు పూనివచ్చియునారు గురి వస్త్రములు నొకట మరియుకుంచి। చిన్నదాని వస్త్రమునొకబో నుండి స్నానమాడుచురచట సంభ్రమమున। గాననీవచ్చుటికి నేగి గన్నెరుపొద। లోన దాగుండియుచు చిన్నదాని వస్త్ర। మపహరించియి తెమ్ము నీవామెవలన। వలయుశుభములు వశయుదు నివాహమయ్యె॥

వ॥ శివకుమారా పైసవిధంబున నీవీదేవేంద్రుని చిన్నకుమార్తెయగు పద్మావని కట్టిపుటంబునుందీసికొనిరమ్ము ఆమెనీకు వివాహమై యామెచే నీకెట్టి కార్యములైన నిరాటంకముగా నెరవేరగలవు పొమ్ముగాని నీతాపద్మావని వస్త్రంబు దెచ్చునెడ వెనుకకుజూడకుము చూచినట్లైతె యేడుగజాల పాషాణమైపడగలవు విన్నావా॥

శివ కుమారుడు

వ॥ మునీదత్రమా! మీయాజ్ఞానుసారంబుగనే యాగన్నేరుపొదలో దాగుండి పద్మావతి వస్త్రంబుచుందెచ్చెదను శలవొసంగుడు॥

సిద్ధుడు.

శివ కుమారుడు

అయ్యా! పోయివచ్చెదను (అని నిష్క్రమించును)

దే వ లో క ము

పద్మావతీ ప్రవేశము

దరువు-యేకతాళము

పద్మావతీయనునాదు పేరు పద్మాయతాక్షులోవినగదే ॥పద్మా॥ పద్మనేత్రిని పద్మగంధిని పద్మసన్నిభాస్యనువినగదే ॥పద్మా॥౧॥ దేవేంద్రునీదివ్యపుత్రికలము యీవసుంధరేశ్వరమింతిరో ॥పద్మా॥౧॥ అందులోననే నతిచిన్నదాన మందగామినిని మహాసుందరి ॥పద్మా॥౩॥ పేరైన(శ్రీ)పెద్దమెటపల్లి గౌరీశ్వరుని మదిగొల్తునే ॥పద్మా॥౪॥

వ॥ ఓహో॥ మేమాదేవేంద్రుని పుత్రికలమగు యేడుగురమక్కచెల్లెండ్రము అందులో చిన్నదాననగుపద్మావతిని మహాసౌందర్యవతిని గదా (అని అక్కలలో) అక్కలారా మననిత్యవిధిదీర్చుకొనుటకై మన మాభూలోకంబునకరుగుజని సప్తకొలనులలోస్నానమాడి తత్సమీపంబుననుండు గన్నేరుపుష్పంబులుగోసికొని శివలోకంబునకేగి శివునింబూజించివత్తము పదండు ఆలస్యంబువలదు!

అ క్క లు

వ॥ సోదరీ! పద్మావతీ అటులనేపోదముపదమ్ము॥

ప ద్మా వ తి

వ॥ రారండు (అని సప్తకొలనులుంచేరి) అక్కలారా గగనమార్గంబున మనమీభూలోకంబునంగల సప్తకొలనులంచేరితిమిగాని యెప్పటివలెనా కటుపుటమొకచోటబెట్టితిని మీరుయార్ధ్రవస్త్రంబులెప్పటివలెమీచోట మీరుబెట్టుడు పెట్టి యీకొలనులోకిరండు స్నానమాడుదము॥

అ క్క లు

వ॥ పద్మావతీ! అటులనేజేసివచ్చితిమి పదము జలకమాడుదము॥

ప ద్మా వ తీ

వ॥ రారండు (అని కొలనులో స్నానమాడుచున్నంత)

శివ కుమారుడు (తనలో)

వ॥ ఓహో! నేనామహేశ్వరుని యాజ్ఞానుసారముగావచ్చి యీగన్నేరు పొదలో దాగుండియుంటిని యిప్పుడా దేవేంద్రునిపుత్రిక లంగరు వస్త్రంబులువిడిచి స్నానమాడ కొలనులోదిగినారు సరి ఇదిమంచి సమయము నేనీపద్మావతీవస్త్రంబుమందీసికొని వెళ్ళెదగాక (అని పద్మావతి వస్త్రంబును గైకొనిపోవుచున్నంత)

పద్మావతి చూచి

వ॥ అక్కలారా అదిగోచూచితిరా యెవ్వడోచోరుండువచ్చి నావస్త్రంబునుంగొనిపోవుచునాడు అబ్బా వానిధైర్యమెంతనవచ్చును మనమిప్పుడు వానివెంటనంటుపుటంబునుంగొని వానిశిక్షించి వత్తము పదుండు॥

అక్కలు

వ॥ అవునుగదా! యెన్నండులేనిచోరుం డిన్నండువచ్చుటేమి చిత్రమో కాని తెలియదు అయినా పూర్కండదగదు పాపము వెంటనంటువానిమర్దించి మనవస్త్రముందీసికొనివత్తము॥

పద్మావతి

వ॥ మంచిది రారండు (అని శివకుమారునివెంటనంటు) ఓరెఓరే దొంగా వస్త్రాపహారి నీవెవ్వండవురా మావస్త్రముందీసికొనిపోవ నిలుని లుము (అని రోదనంబుజేయుచున్నంత)

శివ కుమారుడు (తనలో)

వ॥ అబ్బో! వీరలజొబ్బకు నాకనేకముగా భయమగుచున్నదిగదా నేనీ ఘోరకోర్వజాలను (అని వెనుకకుజూచినంత పాషాణమైపడియున్నం జూచి)

పద్మావతి

వ॥ అక్కలారా! ఇదియేమిచిత్రము నావస్త్రమపహరించినయీ దొంగ మనవాటికోర్వలేక యేమగజాల పాషాణమైపడియుండెనుగదా ఇకమనమిందుండనేల ఇదేనావస్త్రముదీసికొంటినిపదండు మనమాకొదినిలో స్నానమాడి గన్నేరుపుష్పంబులంగొని కైలాసంబునకేగి యీశంకరునిపూజించి మనదేవలోకము మనముబోదముపదుండు॥

అక్క లు

వ॥ సరి! అటులనే జేసి మనలోకంబున కేగుదముపమ్ము (అని నిష్క్రమింతురు)

సిద్ధుడను మునీశ్వరుడు (తనలో)

వ॥ యేమి! శివకుమారుండా పద్మావతివస్త్రంబునకై వెళ్ళి యింకారా డాయెనుగదా పాషాణమాయనా యేమి యేది నేనచ్చట కేగి చూచెదను (అని శివకుమారునిసమీపించి) ఆ-నేననుకున్నట్లైయైనది పాపము యీశివకుమారుని పాషాణరూపము వదలించి మరలనామృత సంజీవనివిద్యచే బ్రతికించెదగాక (అని మృతసంజీవముచే బ్రతికించి) వాహ్వా! శివకుమారా లెమ్ము లెమ్ము యెంతపనిజేసితివి॥

శివ కుమారుడు లేచి

వ॥ స్వామి! మునీంద్రమా నేనేమిసేయవలె నేనాదేవాంగనలఘాటకో పనైతినిగదా॥

వాదము యేకతాళము

సిద్ధ॥ ఆహాశివకుమారా నీయమాయికత్వబదియేమనదగు ॥ఆ॥ మహాన్నతిశేసటుమళ్ళిచూడికన వహవ్వారేవినైతివెంతయిది ॥అ౧॥

వ॥ శివకుమారా ఇదియేనానీసాహసము నీవావస్త్రంబుదేగ వెనుకకు చూడవద్దని నేనెంత చెప్పినవినక చూచి పాషాణమైపడియుంటివి గదా అబ్బా నీవెంతయమాయకుడవు॥

శివ॥ మహాత్మసువిచార మహాదయకామరిమళ్ళి బ్రతికించితిని॥ మహా॥ మహాప్రళయవకామరియాఘాతకు సమీపింపకను యీసరనికైతిని ॥మ॥౨॥

వ॥ స్వామీ! మీరుచెప్పినమాటనిజమేకాని వారిరోదనకోర్వలేక వెనుకకుచూచి ఇట్లైతిని మళ్ళిమీకృపామృతవిశేషంబున పులర్జీవితుండనైతినిగదా॥

సిద్ధ॥ సరేమంచదాయ వోనరేంద్ర నందనమరిఇవినుమొకటి ॥సరే॥ బిరాన యింకొక పరింజనియున త్సరోజాక్షు వస్త్రమింపు దెమ్మికక ॥సరే॥ 3॥

వ। శివకుమారా! గడిచినదానికి ఖిజీకిననేమిలాభము మళ్ళిమరునాడైన నీవచ్చటికేగి భయపడక యాపద్మావతివస్త్రముం దీసికొనిరమ్ము యావస్త్రములభించినగాని నీపనికొనసాగదు కాని మళ్ళివెనుకకు చూడకుసుమా।

శివ। నెరి౯నీదుమాట నిత్త్ర౯విందు భూసురోత్తమోత్తమ ।నెరి౯।
ధరతుప్రిపెదమెటు పురీశ్వరునికృప రంజని యావస్త్రమిందు జెత్తును
।నెరి౯।౪।

వ। స్వామీ! నీవన్నటులనే నేడిచ్చటవిశ్రమించి రేపకడనచ్చటికింజని యాపద్మావతి వటపుటంబునుందెచ్చెద భయపడను నన్నాశీర్వ రించిపంపుము।

సిద్ధుడు

వ। సరిమంచిది! పోయిరమ్ము జయోన్నతుడవుగమ్ము!

శివ కుమారుడు

వ। చిత్తముస్వామీ (అని నిష్క్రమించును)

పద్మావతి మరునాడు

అక్కలు

వ। సోదరీ! పద్మావతి యేమివిచారము!

పద్మావతీ

మ। మనమీనాడును నిత్యనేమమునకై మర్యాదతోప్రీతితో జనియా సప్తకొలంకులందు ననుబల్ స్నానంబులుంజేసి గొబ్బునగన్నేరు సుమంబులంగొనియు నేర్పొప్పంగ కైలాలము జనియా శంకరపూ జజేసియును నోజఃవత్తముపండికన్

వ। అక్కలారా నేడుమనమాభూలోకంబునకేగి సప్తకొలనులో స్నాన మాడి గన్నేరుపుష్పంబులుంగొని కైలాసంబునకేగి శివునిబూజించి వత్తము పదుండు।

అక్కలు

వ। మంచిది పాపదుము పోదము!

పద్మావతి

వ॥ రారండు (అని సప్తకొలనులుంచేరి) అక్కలారా ఇదేకొలంకుకుంచే రితిమి మీవస్త్రాలచ్చట బెట్టుడు నావస్త్రమిచ్చట బెట్టితిని రారండు స్నానమాడుదము।

అక్కలు

వ॥ సరి! అటులనేజేసితిమి పాపమ్మ కొలనులోదిగుము (అని కొలనులో దిగిస్నానమాడుచున్నంత)

శివ కుమారుడు (తనలో)

వ॥ అహా! ఇదిమంచిసమయము వీరుస్నానమాడ కొలంకులోపతికిబోయిరి నేని పద్మావతివస్త్రముందీసికొని పోయెదగాక (అని వస్త్రముందీసి కొని పోవుచున్నంత)

పద్మావతిచూచి

వ॥ అక్కలారా! ఇదిగో మరలనెవ్వండో చోరుండువచ్చి పటుపుట మపహరించి పోవుచున్నాడుగదా అయ్యో ఇదెంతన్యాయము

అక్కలు

వ॥ అన్యాయమేమున్నది లెమ్మ లెమ్మ మామావస్త్రంబులలో నదిదిక కట్టుకొని యీచోరునివెంటనంట వానిమర్దించి మనవస్త్రముందీసి కొనివత్తముపమ్మ.

పద్మావతి

వ॥ మంచిది! రారండు (అని శివకుమారునివెంటబడి పోవుచుందురంత)

శివ కుమారుడు (తనలో)

వ॥ అహా! యీదేవేంద్రకుమార్తెలు వెంటబడినంగాని భయపడక వెను కచూడక యీమునీశ్వరుంజేరికిని మంచిది (అని ప్రకాశముగా) స్వామీ మునీచంద్రమా, నీవన్నటువనే పద్మావతివస్త్రముందిచ్చి నాడ ఇదోచూడుము।

సిద్ధుడు

వ॥ మంచిది శివకుమారా నీవీమరుగున దాగుండుము॥

శివ కుమారుడు.

వ॥ సరి! అటులనేదాగుండెదను (అని దాగున్నంత)

పద్మావతివచ్చి కోపముతో

వ॥ మునీంద్రా! ఇదియేమన్యాయము.

వాదము—యేకతాళము.

పద్మా॥ మునీంద్రనీకిదితగునా యీపనిఁజేయమేలగునా ॥మునీం॥ అనూ నమగుమాదునవ్యాంబరం బునేదుగొనివచ్చెవనీచుడెవ్వడో ॥మునీ॥౧॥

వ॥ మునివర్యా! ఇదిమేనామర్యాద నీతపమేడ నీసత్యమేడ నీవెవ్వని నోతడౌంగనుసంపాదించి మావస్త్రంబు నపహరించుకొనిరమ్మని తెప్పించుకొని మళ్ళీ యేమెరుంగనివానివలెయున్నావు నీవెంతముని ముచ్చువు మావస్త్రంబేదో తెప్పించి మాదిమాకిప్పించుము లేక యున్న నీతపోభంగంబుజేసి నిన్నుశిక్షించకమానను

సిద్ధు॥ శునాసీరనందనులు మీారునిట్లుయననేలబలూ ॥శునా॥ ఘనంబు గనుమీారునంబరంబును గొనంగెవరివశమునోనుఁజూడ ॥శునా॥౨॥

వ॥ హా! స్త్రీరత్నములారా దేవేంద్రునికుమార్తెలగు మీావస్త్రాంబున పహరించ నెవరితరంబవును మీాకువలయువారే యపహరించియుం డవచ్చును లేకయున్న నీవెరివశంబవును ఆదిగాక పద్మావతి వస్త్ర మెవ్వడతహరించునో వాడేపద్మావతికి భర్తయగునని బ్రహ్మలిఖం చియున్నాడు ఆదిమీాకుదెలియునా యేది విచారించుకొనుడు.

పద్మా॥ నరేమంచిదటులైనా యవ్వరుండెవడో యూరులోనా ॥నరే॥ వరం గజూపుము వరించితతనిని మరుగేలభూసురాగ్రగణ్యామ ॥నరే॥౩॥

వ॥ మునిచంద్రమా! బ్రహ్మతుల్యుండవగు నీవాక్యంబునమ్మినేనావెరుము నివరించితిని యాతడెచ్చటున్నడోచూపి నామనంబానందింపజే యుము.

సిద్ధు॥ ధరన్ వెలయు పెదమెటుపురి స్మరాదియగుశివునోటు ॥ధర॥ వరా రోహానీవాశ్శుద్ధికినే స్థిరంగమెచ్చితి మరింగనుమతని ॥ధరన్॥౪॥

వ॥ పద్మావతీ! ఇదిగో ఇతడేనీపురుషుడు యితనినివరించి యాతనిచే సర్వసౌఖ్యంబులందుము బ్రహ్మవ్రాతతప్పదుగదా (అని శివకుమా రుంజూపును)

పద్మావతి (తనలో)

వ॥ ఆహా! యేమి యీదివ్యపునిసౌందర్యము (అని ప్రకాశముగా) మునీంద్రమా యీతనిపేరేమి

సిద్ధుడు.

వ॥ ధర్మరాజుపౌత్రుండు శివకుమారుండుగదా.

పద్మావతి

వ॥ యేమి! శివకటాక్షంబున జన్మించిన శివకుమారుండితడేనా.

సిద్ధుడు.

వ॥ అవును.

పద్మావతి.

వ॥ మంచిది మాయిర్వురికి వివాహంబుజేసి యాశీర్వదించి పంపుడు॥

సిద్ధుడు.

వ॥ సరి మంచిది (అని శివకుమారునిగని) శివకుమారా నీకోర్కె ఫలించి నది ఇదే పద్మావతిని నీకు గాంధర్వ వివాహంబుంజేసెద ఇటురమ్ము॥

శివకుమారుడు.

వ॥ చిత్తము మునీంద్రమా!

——♦ పద్మావతి శివకుమారుల వివాహమహోత్సవము. ♦——

శ్లో॥ తదేవలలగ్నం సుధనంతదేవ । తారాబలం
చంద్రబలంతదేవ । విద్యాబలం దైవబలంతదేవ ।
గౌరీవరే తేంఘ్రియుగం స్మరామి । సుముహూర్తా
సావధాన సులగ్నసావధాన॥

సంధివ——ఇట్లు వివాహంబైన యనంతరంబు

సిద్ధుడు.

వ॥ శివకుమారా! నీక పద్మావతిని వివాహంబు జేసితిని కావున యీమెతో సర్వసౌఖ్యంబు లనుభవింపుచు సుఖంబున నుండు పొమ్ము.

శివకుమారుడు.

వ॥ స్వామీ! మీయాజ్ఞ మెలంగెదను కాని నాకానాలుగు వస్తువులుం దెప్పించి యిప్పించుము.

సి ద్ధు డు.

వ॥ శివకుమారా నీకాని నాలుగువస్తువులు వచ్చేయుపాయమిా పద్మావతి చెప్పగలదు యెకార్యమైన నీమెనడిగి చేయుము సఫలంబవును ఇంకొక విచారము నీవీ పద్మావతి వస్త్రంబు దీనికివ్వకుము నీవద్దనే యుంచుకొనుము దీనికిచ్చిన యెడల యీపద్మావతి స్వర్గలోకముకేగును నీదగ్గరయుండదు విన్నావా.

శి వ కు మా రు డు.

వ॥ మంచిది మీయాజ్ఞ మెలంగెదను నమస్కరించెదను శలవొసంగుము పోయెదము.

సి ద్ధు డు.

వ॥ వత్సా శుభంబగుగాక పోయిరండు (అని పద్మావతితో) పద్మావతీ పోయిరండు నీవీ శివకుమారుని మాత్రము విడనాడకుము.

ప ద్మా వ తి.

వ॥ చిత్తము (అని నిష్క్రమింతురు)

—♦ పద్మావతి శివకుమారునితో. ♦—

వ॥ నాథా! మనరాజ్యంబునకు మనము బోదముపమ్మా ఇచ్చటుండనేల

శి వ కు మా రు డు.

వ॥ పద్మావతీ! అటులనే పోదము గాని యొక్క విచారము.

ప ద్మా వ తి.

వ॥ యేమి విచారము.

వాదము—రూపకము.

శివ—వనజాక్షి వినుము దెలిపెదా। అనుమానమేలనే సదా॥వన॥ అనుపుగ నొకపని గురించి జనుదెంచితినిటకును ॥వన॥ ౧

వ॥ పద్మావతీ నేవచ్చినపని దీర్చుకొని పోయిన బాగుండును గదా.

పద్మా—జననాథయాపనెట్టిదో వినజేయువింనునే నిదో ।జన॥ఘనముగ నీమనమునందు । ననుసంకోచింపక ।జన॥౨।

వ॥ నాథా! నీవుందలపెట్టి కొనివచ్చిన కార్యముబెట్టిదో నిస్సంశయ

శివ—మాతల్లి శీర్ష బాధచే । తాతాప మొందెయుంటచే ॥మాత॥ ఖ్యాతి
గనొక మహౌషధంబు । గావలెనని వచ్చితి ॥మాత॥ ౩

వ. పద్మావతీ మాతల్లియగు గిరిగావతి తలనొప్పిచే పరితపించు చుండ నొక్క మహౌషధంబునకై యిక్కడికివచ్చితిని అవెట్టిదన పకపక నవ్వితె తమ్మలపాకులు కావవలె మాట్లాడితె పోకలు రాలవలెశాస్త్ర పురాణాలు చదివితె కాచురాలవలె కన్నుల నీరువస్తె సున్నముగావలె యీనాలుగు వస్తువులు సంపాదించుకొని పోయిన మాతల్లి తలనొప్పి మానునుగదా॥

పద్మా—యీలేరుజూడ నెంమునూ । యిది చిత్రమాగనందనూ ।యీ।
భూతలమున నీతరియును । భూరుహమును యుండునా। యీలే।౪

వ॥ నాథా! యీనాలుగు వస్తువులుగల వృక్షమీ భూమండ లంబునం దెచ్చటనైన యుండునా ఇది మహాచిత్రముగా నున్నది.

శివ—మునినాథులుగా వచింపగా । జననీయనుజ్ఞ కీతిగా ॥ముని॥ జనుదెం
చితిగానయవ్వి । గొనియును బోవలెనిక ॥ముని॥౫

వ॥ పద్మావతీ! మాతల్లి స్వప్నమంను మునులు జెప్పినచందంబున మాతల్లి శలవిచ్చుటంజేసి ఇంత పర్యాటలరమొచ్చితి యవ్విదీసుక పోయి నంగాని మాయమ్మ రుగ్మత మానదు.

పద్మా—ఇన తేజమంచిదాయగా । వినిపింతు యాస్థితిందగా ।ఇన॥ మొన
యగ పెదమొటుపల్లి । యీశునికృపగలదిక ॥ఇన॥౬

వ॥ నాథా! నీకానాలుగు వస్తువులున్న జాడవిన్నవించెదనిటు వినుము.

శివ కుమారుడు.

వాదము —ఏకతాళము.

పద్మా—వినుమిందూ । వినిపింతు యాస్థితినిముందు ! అనుమానమేల ॥వి॥
మునుకొనియును నిచటికొక్క యోజనమునను నుదయపర్వతం
బుగలం దునవసించు దొండరాక్షసియు తనయచేతనవును నిట్టి
పని ॥వి।౧।

వ॥ నాథా! ఇచ్చటికి యోజనముపెట్టున నొకనుదయ పర్వతం
బుగలదు దానియందుండు దొండరాక్షసి యను రక్కసి భేలమంతుని కు
మార్తెయగు సీలావతిని దెచ్చి పెంచుచున్నది కావున యారాక్షసిని
వధించియక్షకన్య కసివశమైనచో దానిచేయీ నాలుగువస్తువులు దొరు
కగలవువిన్నావా

శివ—వనజాక్షీ యీవార్త వినగమీనాక్షి బహుచిత్రమౌను ॥విన॥
సునిశితముగదాని కెట్లుయీవస్తువులు ప్రాప్తమయ్యెదత్ర్క
మంబును వినయముగనువిన్నవించు వీనులవిందుగాగవిందునంద
ముగ ॥వన॥౨।

వ॥ పద్మావతీ! యారక్కసిచేచంపబడిన సీలావతికి నాలుగువ
స్తువులు లభించెనట్లు దానిచే నాపనికొనసాగుటెట్లు యీయావిధంబం
తవిన్నవించి నామనోసందియంబుఖాపుము.

పద్మా—మరురూపా మహితప్రతాపసుకలాప సుజనైకదీప ।మరు। సర
సముగనునటు వాస్తవముసేడరయ నీతోశృతముజేతునదు స్తర
ముచిత్రముయ్యె తోచుగావునపరమ సీతివంతురాలమె ।మరు। ౩।

సీ॥ అటుసీలావతి యనుదినంబును నేమమునగౌరిశివుల పూజనసేయ
నొకనాడుతద్భక్తి నొనరజూడగగౌరి తాంబూల మపుడు మాయం
బుజేయ తత్పూజలోపంబు తగనొటజూచి యత్తైరవయుగండకత్తె
రయుబూన నపుడమ్మ పతివ్రతమైగోరువరమన్న నాయందుతాం

బాల మమరియుండ జేయుమనగౌరి యట్లనే జేసెగాన దాని మెడ నాల్గువస్తువుల్ దనరియుండు నదియునీకౌను దానిచేసానునీకు కార్యసఫలంబు గాననౌదార్యధుర్య.

వ॥ కావున యాగౌరీదేవి వరిప్రసాదంబున నాసీలావతికిట్టినా లుగువస్తువులు తమంతటతామే గలుగుచున్నవి యామెయందే యానా లుగువస్తువులున్నవి గాని యింక నెవరివద్దలేవు నీవారాక్షసుని వధించి వా నీకామెలభించి యావస్తువులు ప్రాప్తించునుపొమ్ము.

శివ—సరెమంచిది! దటులెబోవుదునూనెంచి వినుమాలకించి ।సరె।
పరమమాయవాది రక్కసియు నేకరణి హాతము యానుపాచె
యాసుందరియు నెట్లు నాప్తనాకు ముందరివిచారమరసి చెప్పు
మిక ।సరె।౮।

వ॥ పద్మావతీ నీవన్నట్టులనే బోయెదనుగాని యారక్కసిజచ్చు యా
నీలావతివచ్చు యుపాయంబెటులో యోచించిపల్కుము॥

పద్మా॥ నినుగాంచి భక్తిచేత నమస్కరించి। ప్రేమజూచామె ।నిను॥
కవికరంబుచేత నీదె నీను పేరేమ నవచించు గిరికుమారుడనియెం
దుచు గురించి వస్తివంచడు గలింగనిని పూజజేయవస్తినను।
నిను॥౯॥

వ॥ నాథా! నిన్నా నీలావతినిజూచి నమస్కరించి నీ వెవ్వరెందుకువచ్చి తివని యడుగును అడిగిన గిరికుమారున్ని నిత్యనేమముచే లింగమూ ర్తినిపూజించువాడను అందుజే నిప్పుడీపర్వతంబున లింగమూర్తి యున్నాడని తెలిసి తల్లింగమూర్తిని పూజించుటకై వస్తినని చెప్పుము ఆపైన అన్నిపనులు సఫలమౌను విన్నావా॥

శివ॥ ననబోణీ! పెదమెట్టుపల్లి రుద్రాణీ। పతియేలు నెపుడు ॥నన॥ విన
యముగను నీవుమాటకై వడి జనుదుగాని నేనువచ్చునందాకను
వసించి యుండుమిందునను నీవును జయంబుగోరి నన్నంపు ॥

వ। పద్మావతీ! ఇదే నేనాయుదయాద్రికిం జని నీవుజెప్పిన చొప్పున వర్తించెదగాని జయంబునరమ్మని శలవొసంగి నేవచ్చుపర్యంతర మీావచ్చటనే యుండుము॥

పద్మావతి.

వ॥ మంచిది! మనోహరా ఇదేనీ కేడురాళ్ళను మంత్రించి యిచ్చుచున్న దానను వీటింగైకొని సమయానుకూలముగా వాడుకొమ్ము ఇవి మహా గొప్పవని యిచ్చునుగదా॥

శివకుమారుడు.

వ॥ సరి నీవిచ్చిన యేడురాళ్ళను గైకొంటినిగాని శలవిమ్ము పోయెదను

పద్మావతి.

వ॥ మంచిదా! పోయిరమ్ము జయోన్నతుడవు గమ్ము॥

శివకుమారుడు.

వ॥ ఇదో! నేబోవుచున్నవాడ (అని నిష్క్రమించును)

ఉదయాద్రిపర్వతము.

నీలావతి ప్రవేశము.

దర్వు—యేకతాళము.

నీలావతిని యనుబాలా మణినివో నీలవేణిరో। వోనీలవేణిరో। సుగుణాలబాలరో॥ చెలినీలా॥౧॥ చంద్రాభముఖినిగజేంద్రా భయానను చంద్రకాంతినే। నేచంద్రకాంతినే॥ గుణసాంద్రనింతినే ॥చెలినీ।౨॥ పేరైన పెదమెబుపారీశ్వరుని మదికోరిదల్తునే। నేకోరిదల్తునే। రుచులూర గొల్తునే ॥చెలినీ॥౩॥

వ॥ ఓహో! నేనామాళవదేశపు రాజగు చేలమంతుని కుమార్తెనగు నీలావతిని నేనుబాల్యమందు నాచెలికత్తెలతో గూడియాడు చుండగా యీాదొండరాక్షసి చెలికత్తె స్వరూపకముగావచ్చి నన్నెత్తుకొని వచ్చి యీాయుదయాద్రి పర్వతంబున నుంచి పెంచుచున్నదిగదా దానినే తల్లిగాభావించి యీాసిద్ధేశ్వరస్వామిని పూజించుచు దినంబు గడుపు చుంటినిగదా (అని శివపూజ జేయుచున్నంత)

దొండరాక్షసి ప్రవేశించి (తనలో)

వ॥ నేనీ యుదయాచలనివాసినియగు దొండరాక్షసిని యీ నాపుత్రిక యగు నీలావతితో కలవుపొంది యీసూర్యోదయంబునుండి సాయం కాలపర్యంతర మీయరణ్యమంత సంచరించి నా యాకలిదీర యాహారంబుభక్షించి వచ్చెదగాక (అని నీలావతింజేరి ప్రకాశముగా) బిడ్డా నీలావతి నేనాహారంబుకై వెళ్లుచున్నదాన నేవచ్చునందాక జాగ్రత సుమా!

నీ లా వ తి.

వ॥ అమ్మా పోయిరమ్ము దినమాన మెట్లోయట్లె వర్తించెదను.

దొం డ రా క్ష సి.

వ. ఇదేనేబోవుచున్నదాన (అని నిష్క్రమించును)

శివకుమారుడు (తనలో)

వ॥ ఓహో! నేనా పద్మావతి యనుమతంబున నీ యుదయాచలంబుం జేరితిని గాని నీరావతినిసమీపించెగాక (అనినీలావతింజేరియున్నంత)

నీ లా వ తి.

వ॥ ఆహాహా! మహానీయా నీవెవరు॥

వాదము:—జల్వతాళము.

నీలా—యెవరో నీవెవరో నీవెవరో నాతోడబలుకు ! యెవ॥ సవినయ యముగ నిచటికి। జనుదెంచుట యేటికి। వివరించుము విని యెదనీ ॥వెవ!౧॥

వ॥ అయ్యా! నీవెవ్వరు నీనామధేయంబేమి నీవెంది కొరకింపవచ్చితివో చెప్పుము మహానుభావుండవగు నీకు నమస్కరించెదను॥

శివ॥ కువలయ దడలోచని నేవివరింతును వినుమునేడు ।కువ॥ అవనిగిరి కుమారుడక్। శివపూజ ధురీణుడక్ ప్రవిమలగుణ భావిండను॥ కువ॥౨॥

వ॥ సుందరీ నేను గిరికుమారుడను నామంబుగలవాడను నిత్యలింగపూజ లేనిది నేనుండను కావున యీపర్వతంబున లింగమూర్తి యున్నా డన విని పూజించుటకై వచ్చితిని యాదేవాలయ మెచ్చటున్నదో

చూపించి పుణ్యంబు గట్టుకొనుము॥
నీలా—అహాహా సుగుణాత్మక సిద్ధేశ్వర ముర్తి మనగవచ్చు. అహా! మహా దేవాలయమునకా? మరుజూపెద శ్రేష్ఠముగా విహితమ్ముగను విచ్చే యుము॥ అహా॥౯॥
వ॥ గిరికుమారా! నీభగవద్భక్తి విశేషంబునకే నెంతో సంతోషించితిని సరి నీకా శివాలయంబుం జూపెదను రమ్ము శివపూజ సేయుదువు
శివ॥ మహా శ్రీ పెదకొట్టుతల్లి యహారాభ్యాపణుని గ్రహాము॥ మహా! సుహితమ్ముగను జూడగా॥ సుందరిపోదము యిగా॥ సహజముగ నుజూడగా॥ సుందరిపోదము యిగా॥ సహజమ్ముగను జనుదెంచుము ॥మహా॥౮॥
వ॥ సుందరీ! రమ్ము యాశివాలయంబునకు తడయకలను॥

❖ నీలావతి ❖

వ॥ రారమ్ము! పోదము పమ్ము (అని శివాలయంబుం జేరి) గిరికుమారా ఇదియే శివాలయము చూడుము యాసిద్ధేశ్వరుని పూజించుము॥

శివకుమారుడు.

వ॥ వందివి (అని లింగమూర్తి నుద్దేశించి) ఓం హర హర మహాదేవా శంభో శంకరా॥

సీ॥ అభిషేకమును దేవతాపగాధరునకు నాద్యంబు వేద సంవేద్యునకును
ఆచమనంబు త్రిలోచనునకు బీరితిగంధంబు శ్రీ నీలకంధరునకు।
అక్షతల్ శ్రీ విరూపాక్షునకును హరిద్రాచూర్ణమును త్రిపుర
దహనునకును। కుంకుమ శ్రీసన్నగాంక శేఖరునకు పరిమళోపేతం
బు పశుపతికిని । పుష్పములుభక్తసంఘ సంపూజ్యునకును ధూని
దీపంబు త్రైలోక్యదీపకునకు మరియు నైవేద్యమునుగబాసురహరు
నకు ఆత్మప్రదక్షిణమును గిరిజాధిపతికి వందనము దేవతా మాప
వంద్యునకును.

వ॥ తరుణీ నేనీసిద్ధేశ్వరలింగమూర్తిని షోడశోపచారములచే పూజించితిని గాని యొక్కటాంబూలము తక్కువయైనది తెమ్ము యాశివునికర్పించెదను.

సీలావతి

వమాహా! గిరికుమారా తాంబూలముకావలయునా ఇదోచే కొమ్ము (అని పకపకనవ్వి మాట్లాడి పురాణాలుచదివి కన్నులనీరువడ పినంతలో తమ్మలపాకులు పోకలు కాచుసున్నమైనంజూచి

శివ కుమారుడు (తనలో)

వ॥ అహా! యేమి యీనీలావతి పకపకనవ్వంగనే తమ్మలపాకులురాలెను మాట్లాడితే పోకలురాలెను శాస్త్రపురాణాలు చదివితె కాచురాలెను కన్నులనీరువడపితె సున్నయను మంచిది యీనాలుగువస్తువులచే తాంబూలముగావించి శివునికర్పించెదగాక (అని తాంబూల మర్పించి ప్రకాశముగా) స్వుందకి శివపూజపూర్తియైనది పోదముపమ్మ

సీలావతి

వ॥ సరిమంచిది (అని లింగమూర్తినుద్దేశించి) శంభో శంకరా యీమహానుభావునినాకు భర్తగాజేయుము దేవా మహానుభావ నమస్కరించెదను (అని నమస్కరించి శివకుమారునితో) గిరికుమారా రమ్ము మాగృహంబునకేగుదము.

శివ కుమారుడు

వ॥ మంచిది! పమ్ము (అని గృహంబుజేరినంత)

సీలావతి

వ॥ గిరికుమారా! ఇటొకసారి నామాటవినుము.

శివ కుమారుడు.

వ॥ యేమిమాట.

ఉ॥ పుట్టిననాటినుండి పరపూరుషునెన్నడు జూడలేమనే డిట్టినువేళ యందు నినుయింపుగగంటిని గాననివెనా నెట్టినభర్తవిందుకయి నేను నునేకుకును భార్యనైతినా పుట్టుఫలంబునేడిపుడు పూర్ణముగా ఫలియించెవల్లభా.

వ॥ మనోహరా! నేను పుట్టిననాటినుండి పరపురుషుని ముఖంబుజూచిన దానసుగాను యిప్పుడు నిన్నుజూచినంతనే నీవు నాభర్తవని వరించితి నీవు భర్తవైతివి నేను భార్యనైతిని ఇందుకు సందేహ మేమ యునులేదు ఇదియే నిశ్చయమని నమ్మవలయును॥

శివకుమారుడు.

వ॥ అహాహా! సుందరీ నీమృదు మధురోక్తులకే నెంతో సంతోషించితిని గాని యిటువినుము।

వాదము—యేకతాళము.

శివ॥ సుందరి యరవిందాక్షుసఖీ। యిందు మొకటి చంద్రముఖీ ॥సుంద॥
మదగమన నీవిందునుండగను। మెందుకు నీపేరేమి నాతోఇందు
దెల్పు మంచముగను ॥సుంద॥౧॥

వ॥ సుందరీ! మహాశృంగారవతివగు నీవిరాక్షస సంచారంబగు పర్వతంబున నుండకారణంబేమి నీస్థితిగతి నామంబులుం దెలిపి నామనంబానందింప జేయగు॥

నీలా॥ సుందరరూప దయార్ద్రమహా। నందభావ యేమనుదహా ॥సుం॥
పొందుగ వినునాపూర్వాకృతమే। ముందునుయీలాటి కష్టమెుంద
వలసె కుందవలసె ॥సుంద॥౨॥

సీ॥ వినవయ్య నాపూర్వ వృత్తాంతమును విన్నవింతు మాళవ దేశకాంతుడైన। చేలమంతునిదివ్య చిన్నికుమారిక। నాపేరు నీలావతం(డు నేను। బాల్యమందున నాను బాలికలంగూడి యాడంగ యీరాక్షసాంగనయును। చెలికత్తె వేషంబు చేకొని నన్నెత్తుకొనివచ్చి యీ నగంబుననుంచి। పెంచిపోషించుచుండె నేనంచితముక। కాలమును వృథబో జేయకను తదేక। నిష్ఠతో గౌరిపూజనల్ నిత్యనేమ। మునను జేయుచునుంటినో మనుజనాథ॥

వ॥ అయ్యా! నేనా మాళవ దేశాధిపతియగు చేలమంతుని కుమార్తె నగు నీలావతిని నేనొకనాడు నా చెలికత్తియలంగూడి యాడుచుండగా యీదొంకరాక్షసి చెలికత్తెవేషంబునవచ్చి నన్ను మోసపుచ్చి యెత్తుకొనివచ్చి యీయుదయాద్రి యందుంచి పెంచుచుండెను నేనా గౌరీశంకరుల పూజజేయుచు దినంబుగడుపుచుంటిని కావున యీనాడు నీవగుపడితివి నన్ను వివాహంబు జేసికొనుము నిన్నువరిం

శివ॥ మంచిదాయెనామాట యుహా। మునివిన్నను వరియింతునిను ॥మంచి॥
అంచితముగ యాయసురాంగన యిపు। డెంచగను నేడెందు
బోయె నెపుడువచ్చు మళ్ళియిటకు ॥మంచి॥ ౩॥

వ॥ నీలావతీ! నిన్నెత్తుకవచ్చి పెంచుచున్న మాయాంగరాక్షసి యెక్కడికి పోయినది మళ్ళి యిక్కడికి యెప్పుడువచ్చును, యాస్థితివిన్నవించి నామాట వింటివేని నిన్నువరించెదను శీఘ్రావా।

నీలా—కాంచనాంగ నీవాక్యమిట్లా। కడువేగము విందునేనులకా॥కాం॥
ఎంచివినుము యాపాలను దిండిసము। దంచితముగను మేతకయిం
మేతకయ్యె యరిగెకాననంబునకును॥ కాంచ॥

వ॥ అయ్యా! ఆదొండరాక్షసి దినమానము ప్రొద్దున లేచి ప్రొద్దుగుంకె పర్యంతర మాయారణ్యములో సంచరించి యాహారం బనుభవించి మళ్ళి సాయంకాలమునకు యిల్లుజేరును గాని మీామాటయేదో చెప్పుము తప్పక వినియెదను॥

శివ॥ ఆరాక్షసి వచ్చిన వెనుకా యడుగునొక్క వాక్యమును యికా ॥ఆ॥
ఆహాళిగ నన్నతిప్రేమతోనిట। జేరదె స్త్రివైన గాని జేయవైతి
వేమి పెండ్లి ॥ఆయా॥ ౪॥

వ—నీలావతీ! ఆదొండరాక్షసి వచ్చినతోడనే నీవనుగటా అమ్మా నన్నుదీసుకవచ్చి యిన్నిదినంబులాయెను నాకు పెండ్లియన్న మాట లేకపోయెను నీవు పెద్ధమనిషివైతివి. ఇంక యెన్నాండ్లు బ్రతుకగలవు నీయాయుష్య మెక్కడున్నది చెప్పుమని దాని యాయుష్యంబు జాడదీయుము అటుతరువాత అన్నిసంగతులు చెప్పగలను।

నీలా—భూరిపెదసొట్టుపల్లిలో। జేరియున్న శివుని నాత్మలో ॥భూరి॥
కోరినమ్మి మీాకారాక్షసి విధ। మారయనేనంత దెలసి యదియు
నీకు జెప్పుదాన ॥భూరి॥ ౫॥

వ॥ నాయకా మీారన్న విధంబుననే యాదొండరాక్షసి యాయుఃప్రమాణమంత దెలిసికొని మళ్ళిమీాతో జెప్పెదను. సందేహమేమి మీారు క్షాత్రము నన్ను విడనాడవలదు॥

శివకుమారుడు.

సిలావతి.

వ॥ చిత్రము (అని అనునంతలో సాయంకాహ్నమైనంత)

దొండరాక్షసి వచ్చి.

వ॥ ఓహో! నేను పొర్ద్రినన యాహారమునకై వెళ్ళి పొర్ద్దుగుంకను నాకడుపునిండ మేతభక్షించి నాయిల్లుజేరితిని మంచిది నాయింటిలో సుఖంబున నుండెదగాక (అని అనుసంతలో)

శివకుమారుడు (తనలో)

వ॥ ఆహా! యీదొండరాక్షసి యిల్లుజేరినది దీని కగుపడకుండ పద్మావతి మంత్రించియిచ్చిన యేడురాళ్లలో నొక్కరాయి నాచుట్టు దిగ్గింపవైచుకొని కూర్చుండి వీరిసంభాషణ వినియెదగాక (అని యట్లుజేసి కూర్చున్నంత)

సీలావతిని దొండరాక్షసి సమీపించి.

వ॥ తల్లీ! సీలావతీ యేమిసమాచారము॥

వాదము—రూపకము.

సీలా—అమ్మారో నామనవి వినుము అతిముదంబు నా ॥అమ్మ॥ నమ్మితివో నన్నుదెచ్చి సాకుచుంటి వింతేకాని। యిమ్మహీ నాపెండ్లి జేయ వెన్నాళ్ళని యుంకునిటుల ॥అమ్మ॥౧॥

వ॥ అమ్మా నన్నుదీసుకవచ్చి యిన్నిదినంబు లాయెను గాని నాకుపెండ్లి జేయవైతివి కావున యౌవనస్త్రీనై యెన్నాళ్ళని యిట్లుందును నాకువివాహంబు జేయుము॥

దొం—తమ్మికంటి యేమిసేతు తగవరు మాలియుూ ॥తమ్మి॥ క్రమ్మియు నేనున్నదానగాను నీకు కొరకునయ్యో। దిమ్మతినిగాని యెచట లేడు నీకు తగినవిభుడు ॥తమ్మి॥౨॥

వ॥ అమ్మాయీ! నీకు వివాహంబుజేతమని యెందరో రాచకుమారులం జూచిన నాభయంకరాకారంబు జూచి వారలు వెంటనే ప్రాణంబులు విడుచుచున్నారు. నేనేమిసేయవలె కొంత రాశిన నీకుందగు చక్కని పురుషుని వెదకితెచ్చి పరిణయంబు జేతును తొందరొంద

నీలా——యెంతక నీతా డీయుందుయేను తల్లిరో ॥యెంత॥ యింత యింత నివువృద్ధ కాంతి వైతివైననీకు। అంతమేమో తెలునునీకు చెంత ఛాయ నేమిగతియు ॥యెంత॥ ౩।

వ॥ అమ్మా నేనెన్నాండ్లని యీయాయుండును: మరి నీవు పెద్దపెద్ద మనిషి నీకూయుష్యము స్థిరమా నీవు ఒప్పిన వెనుక నాగతేమో నేనేమో ఇక నేనేమి సేయుదు॥

దాం——ఇంతలోనికింత జాలియేలనే సు॥ తా॥ఇంత॥ యెంతయైన నాకు యాయు వెవరికేమి దెలియునిమ। చింతలుండుగ జెప్పెద నీవతం

సీ॥ ధరణిలో సప్తసాగరము లావలనుండు ధర్మరాజసుతుండు ధార్మి కుండు ♦ తాతకుమారుడ య్యాతని పుత్రుండు శివకుమారుండు బల్ శిష్టసుతుడు ♦ అతడు యీయేడబ్ధు లవలీలదాటి దేవేం ద్రుని సుతశరచ్చంద్రియశను ♦ పద్మావతిని పెండ్లి పరగనాడి యు నిచటికే తెంచి యీయుక్కుచేతనైన ♦ స్తంభమునువిఱుగ గొట్టియు సరగనీదు ♦ పూజపీఠంబు క్రిందబల్ పొసగనున్న ♦ బిలుగు పంజరమున రామచిలుక నట్టి ♦ బట్టిచంపిన జత్తునో కట్టుదినుమ॥

వ॥ అమ్మాయీ! పూజపీఠంబుక్రింద నుండబడు పై డిపంజరములో నొక రామచిలుకయున్నది దానిలో నా యాయుష్యమున్నది. కాపున యీ యేడుసముద్రంబులావలనుండు ధర్మరాజు సౌత్రుడు తాత కుమారుని పుత్రుడు శివకుమారుడునువాడు, యీ సప్తసాగరంబు లుదాటి దేవేంద్రుని కుమార్తెయగు పద్మావతిని పెండ్లియాడి యిచ్చటికివచ్చి యీయుక్క స్తంభమును దాకి యీరామచిలుకను జంపినంగాని నేజావను యీశివకుమారుం నేడ యిచ్చటికి వచ్చుటేడ ఇదంతకల్ల॥

నీలా——యేమోగానీ యెటులదోచదేమె మాతరో ॥ఏమొ॥ కామనూ రుని సత్కృపెటులగలదో కాని తెలియదాయ। నామనంబుస్థిర

వ॥ అమ్మా యీభాగవవిష్ట మెట్లున్నదో కాని నాకేమియు౦ దెలియదు నాకర్మమేమో నేనేమో॥

దో॰—తామరసేక్షణిరో నికీతాపమేటికే ॥ తామ ॥ నిమది నామాట నమ్మి భూమినిపెదమెట్టుపల్లి। భామసాక్షి నిను పెండ్లితప్పక కా నొనర్చుదాన ॥తామ॥౬॥

వ॥ తనయా! నీవిట్లు పరితపి చవసుదు తప్పకనిను పెండ్లియూను నేజేసె దను నామాటనమ్మెము॥

♦ సి లా వ తి ♦

వ॥ తల్లీ! యెట్లుజేసిన నిదయనే నికన్న నాకెవ్వరున్నరు॥

దొ ం డ రా క్ష సి.

వ॥ మంచిది (అని అనునంతలో సూర్యోదయంబైన నిలావతితో) తల్లీ నిలావతీ! యదో సూర్యోదయ మగుచున్నది నేను మేతకై వెళ్ళు చున్నదాన జాగ్రితసుమా॥

♦ నీ లా వ తి ♦

వ॥ చిత్తము! తల్లీ! పొమ్మి మేతలారగించి రమ్ము (అని తనలో) ప్రాతః కాల మందానదిలో స్నానమాడి సిద్ధేశ్వర లింగమూర్తిని పూజించ వెళ్లెదగాక అని నిష్క్రమించును అంత)

శివకుమారుడు లేచి.

వ! ఆహా! యీదొండరాక్షసి యాయువ్యమంత నాకుందెలిసినది మం చిది యీయుక్కు స్తంభమును గుద్ది విరుగ ద్రొబ్బెదగాక (అని స్తంభమును విరుగగొట్టినంత)

దొండరాక్షసి వచ్చి కోపముతో.

వ॥ ఒరేఒరే! దుర్మార్గ నీవెవ్వండవు నాస్థలంబునకొచ్చి నా స్తంభం బును విరుగవైచితివి అద్బా నీసాహసం నెంతసవచ్చును॥

శివకుమారుడు.

వ॥ ఓసీ! రక్కసీ! ఇదివరకెందరినో కన్నెలందెచ్చి బంధించియున్న నీ మదంబణంచ యిదే శివకుమారుండు వచ్చియున్నాడు చూడుము నా ప్రభావంబు నీకుదెలియదు॥

గొండరాక్షసి(

వ॥ ఏమి నీవు శివకుమారుండవా (అని వెల్లబోయి) అయినా భయమే మున్నది రమ్ము నాతో సమరంబు జేయుము॥

వాదము—జుల్వ తాళము.

దొం॥ ఓరి శివకుమారునిక। మారణ మొందించకవిడ ॥ఓరి॥ రారా నీబలమదెం। తోరయమునకు। ఆరూఢిగజూపునాకు ॥ఓరి॥౧॥

వ॥ ఒకే! శివకుమారా బ్రహ్మాదుల కలవిగాని నన్ను జయించెదనని వచ్చినచే సహింపుదానసుగాను రమ్ము నీబలంబు జూపుము నాముందరేమి సాగదు॥

శివ॥ క్రూరరాక్షసి నిదుం। దూర భారమెంచ కిపుడె ॥క్రూర॥ మారణ మొందించియుక । మరి యమపురికి । జేరబెత్తుం తక్షణమున ॥ క్రూర ॥౨॥

వ॥ ఓసీ! మదోన్మత్తపిశాచీ నిన్ని సమరంబున సంహరించి యమపురంబున కనిపెద చూడుము॥

దొం॥ ఇంతకావరంబసి॥ గొంతునొకిక చంపెదనివో ॥ఇంత। పంతంబులు బలికియుక। పదుగిడినవి దా గొంతుమూడు నాబలంబు॥ఇం॥౩॥

వ॥ దేవతలనైన బారదోలు నాముందర నరమాత్రుండవగు నీవనెంత నిన్నుమర్దించక మాననుకెక్కడ నాగలోక మెక్కడ॥

శివకుమారుడు (తనలో)

వ॥ ఓహా! దీనితో వాగ్వివాదంబు జేయుచు వృథాకాలంబు గడప నేల యీనిలావతి పూజకద్దేక్రిందనున్న రామచిలుకందీసి చంపినంగాని ఇదిశిక్షింబునం జావదు (అని రామచిలుకందీసి పట్టుకొని కొని ప్రకాశముగా) ఓసీ రక్కసీ॥

ఇంతే నిజీవముల్। యేనుగ్రహించితిని చూడు ॥నింతే॥ చెంతనున్న దీరామచిలుకను గనుము। ద్రుంతు దీనినంతమారు॥ వింతే ॥౪॥

వ॥ ఓసీ! రక్కసీ నియాయుష్య మీరామచిలుకలోనే యున్నది గదా దీనిం జంపినంగాని నివుచావవు చూడుము ఇది నాచే జిక్కినది దీని చంపివైచెదను॥

దొండరాక్షసి (తనలో)

వ॥ యేమి! నాగుట్టు బైటపడినదే (వీనికి నా యాయుష్యమెట్లు తెలిసెను. ఇదంత దైవమాయగా నున్నది అయినా వీనిచే నేను హతంబవుట నిక్కము హా! సర్వేశ్వరా ఇకనేనేమి సేయుదు!

హరహర యిదియెంత కాల ర్యంబాయను తెలియదాయ ॥హర॥
మరిపీడిట నన్నికన్ । మర్దించకనూ । కరమరుదుగ విడువబోడు॥
హర॥౫॥

వ॥ శంకరా! పాపభయంకరా యీశివకుమారుండు నన్ను చంపక మానడు. ఇగనేనేమి సేయుదు॥

శివ—జరభిరండరక్కసీ। మరి నీ వధియింతుచూడు ॥జర॥ ధరణిక్ పెద మొట్టుపోతిల్ । థామునిసాక్షీ। జరచెద నీచిలుకను ధర ॥జర॥౬॥

వ॥ ఛీ పాపాత్మురాల! చావుము యీరామచిలుకను గిరగిరం ద్రిప్పి నేలంజవచితిని (అని చిలుకను నేలంజరచినంత)

దొండరాక్షసి.

వ॥ హా! దైవమా (అని నేలబడి చచ్చును) (అంత)

నీలావతి వచ్చిచూచి (తనలో)

వ॥ యేమ యీ స్తంభము విరిగినది యీ నాతల్లియగు దొండరాక్షసి చచ్చినది యీతడు శివకుమారుండా యేమి శివకుమారుని చేతిలో నాయాయుష్యమున్నదని మాతల్లిజెప్పెనుగదా అది నిజము కాబోలును (అని శివకుమారునితో పరిహాశముగా) ఓయీ। నీవుశివకుమారుండవై గిరికుమారుడనని చెప్పి నన్నింత మోసపుచ్చితివి. ఇది యేనామర్యాద॥

శి వ కు మా రు డు.

వ॥ నీలావతీ! శివకుమారుండంటేమి, గిరికుమారుండంటేమి ఇద్దరొకటే కదా గౌరీశంకరులలో నెవరిపేరుచెప్పిన నేమి భేదమున్నది. నిశ్చయముగా నేను శివకుమారుండను తెలిసినదా॥

♦ నీ లా వ తి. ♦

వ॥ తెలిసినది నాథా ఇప్పుడుగదా నామదిసంతోషించినది. రారమ్మా మన మీలింగమూర్తిని తత్కటాక్షంబు వడయుదము.

శి వ కు మా రు డు.

క॥ సరి పమ్ము (అని లింగమే త్రింజేరి) నీలావతీ లింగని సమీపించితిమి పూజింతము రమ్ము. (అని ఇద్దరుభక్తిశ్రద్ధలతో జేతులుజోడించి)

చ॥ శరణు గిరీంద్ర జారమణ చంద్రికళాధర భక్తవత్సలా శరణుపినాక పాణీ శివశంకర దీనజనావన ప్రభో। శరణుదయా సముద్రభవసాగ రతారకనామ ధూర్జటీ। శరణు మహేంద్రవంద్య పదసాంబ సదాశివ పాహిమాం ప్రభో॥

వ॥ శంభో! శంకరా మహాదేవా హరహర మహాదేవ హర (అని తదేక నిష్ఠతో ధ్యానించుచున్నంత)

పరమేశ్వరుడు ప్రత్యక్షుడై.

వ॥ హే! శివకుమార నీలావతులారా! మీభక్తిశ్రద్ధలకేను మెచ్చినా నిజరూపంబుం జూపితిని మీకెట్టివరంబుగావలయునో కోరుడు నే నిచ్చెదను॥

శివకుమార నీలావతులు.

వ। దేవా! నమస్కరించెదము. భగవద్దర్శనంబుకన్న యెుండెద్దివరమేము న్నది. నీకటాక్షమే మాకు మోక్షదాయకము॥

ప ర మే శ్వ రు డు:

వ॥ మంచిదిదంపతులారా! మీయిద్దరికి గాంధర్వ వివాహంబుంజేసియొక్క పుష్పమిచ్చుచున్నవాడ దీనింగైకొని మీరాజ్యంబునకేగి నూరుసంవత్స ములు రాజ్యపరిపాలనంబుంజేసి సర్వసౌఖ్యంబు లనుభవింపుచు సుఖం బుగనుండుడు. ఆటుపిమ్మట మీకు మత్కైలాసంబ్రాప్తి బిచ్చెదను నమ్మి మీమాస్థానంబుకేగుడు. ఇదియే శలవు (అని అంతర్ధానమగును)

శివకుమారుడు.

వ॥ మహాప్రసాదము (అని నీలావతితో) నీలావతీ ఇటువినుము మన మీశంకర ప్రసాదంబు వడిసితిమి శంకరదత్తంబగు యీపుష్పకంబు పై నెక్కి పద్మావతిపద్దికిం బోదముపమ్ము.

వ॥ చిత్తము। నాథా అట్టులనే పోదము పమ్ము (అని పద్మావతితో జేరి యున్నంత.

పద్మావతి శివకుమారునితో.

వ॥ శివకుమారా! నాలుగువస్తువులు దెమ్మంటే వృక్షమే దెచ్చితివి ఆహాహా! సంతోషమాయనుగదా (అని అనునంతలో)

నీ లా వ తి.

వ॥ అక్కా పద్మావతి నమస్కరించెదను కటాక్షించుము.

వ॥ సోదరీ నీలావతి శుభంబగుగాక (అని శివకుమారునితో) నాధా యిటు వినుము.

శివకుమారుడు.

వ॥ యేమి పద్మావతీ.

ప ద్మా వ తి.

వ! మన మీమువ్వురము మాశంకరుడిచ్చిన పుష్పకలబుపై నెక్కి మన రాజ్యము బోదముమమ్మా!

శివకుమారుడు.

వ॥ మంచిది అట్టులనే యీపుష్పకంబుపై నెక్కి పోదము పదుండు (అని నిష్క్రమింతురు)

కళింగపట్టణము.

ముంగిరాజు ప్రవేశము.

దర్వు—యేకతాళము.

నేముంగిరాజునురా। సుత్రామువైభవుండ· ధీయుతుండను ॥నే। సామజారి విక్రముండ విలసత్కీర్తిను బలుండ మదనసుందరుడ సం। గ్రామ జయుడవన్నెలకుతురగ గ్రామయుతుడ। ఘనసుగుణుడ నేముం ॥౧॥ సోమాననుండనురా। గుణధాముడ కళింగ పౌర వాసుడ॥ సోమా। భూమిపెదమెట్టుపల్లి విలసద్ధాముడైన వామ దేవునిమది। నేమరకను నమ్మి కొలచెదాసుడను। నీమపమడ నామఘనుడ ॥నేము॥౨॥

మం త్రి.

వ॥ హేముంగిలాజా సేవన్నట్టులనే మన రాజ్యమంత తేషమేమే యున్న మహాప్రభో.

ము ం రా జు లు.

వ॥ సరిమంచిది మంత్రీ, మనమీనాను స్వారి వెళ్ళవలెనని నిశ్చయించి యున్నవాడ కావున మనవన్నెలతుతురంబునుసముకూర్చుకొనిరమ్ము. నేనే యుత్తమాశ్వంబుపై నెక్కి సిద్ధంబుగానున్నవాడ॥

మ ం త్రి.

వ॥ రాజా అట్లులనే సముకూర్చి యున్నవాడ పోదము పదండు.

ము ం గి రా జు.

వ॥ మంచిది రారమ్ము పోదము (అని స్వారిమార్గంబున వచ్చుచున్నంత) శివకుమారుడుచూచి పద్మావతితో.

వ॥ పద్మావతీ ఇది యెవ్వరిబలము గావచ్చును. యీరాజు యెక్కిన యశ్వంబు నాకులభించిన బాగుండునుకదా॥

ప ద్మా వ తి.

వ॥ మనోహరా! యీతడే కళింగ పట్టణమేలే ముంగిరాజు యీయశ్వకుండుటముచే నీతడు సర్వశతృవుల జయించి జయంబుగొని యున్నాడు. కావున నీతురంగము నీకేందుకు నీకున్నతురంగము నీకు చాలదా॥

శివకుమారుడు.

వ॥ లేదు యీతురంగములేనిది కూడదు. నాకాతురంగము వచ్చేయుపాయం బూహించి చెప్పుము.

పద్మావతి.

వ॥ నీకట్లున్నయెడల నేనొక యుపాయంబుం జెప్పెద నిటువినుము.

క॥ మును నేనిచ్చిన యే। డునురాళ్ళలో నొక్కటప్పుడుంబోయెనుయం। దున గల్గునొక్కటి యిపుడీ। ఘనయశ్వము మీదనేయు గలిగెడు జయమున్॥

వ॥ మనోహరా! ముందునీకు మంత్రించి యిచ్చిన యేడురాళ్ళలో నొకటి వ్రయమైనది. తక్కినరాళ్లలో నొక్కరాయియిపుడీ యశ్వంబు

డు రాజుతో యుద్ధముజేసి సమ్మోహనాస్త్రంబున నాతని సేనా సమేతము మూర్ఛనొందించుము. అప్పుడు నీకు జయమగును పొమ్ము.

శివకుమారుడు.

వ॥ మంచిది అట్లులనే జేసెదను. ఇదో నేబోవుచున్నవాడ అని ముంగి రాజును సమీపించి ఆహా ఇదియే మంచిసమయము యాపద్భా వతి జెప్పిన క్రియంబునం జేసెదగాక (అని యట్లుజేసి గుర్రము ను స్వాధీనపరచుకొని యున్నంత)

ముంగిరాజు (తనలో)

వ॥ ఆహా యేమి యీతడెవ్వడో కాని హఠాత్తుగావచ్చి నన్నిగుర్రము నుండి క్రిందబడగొట్టి తద్గుర్రమాతని స్వాధీనముగా జేసికొనియున్న డైతే ఇదియేమి యాశ్చర్యము వీనిసాహసం బె తనవచ్చును.అయి నా యూరకుండ దగదు (అని ప్రకాశముగా) ఒరే నరాధమా॥

వాదము—యేకతాళము.

ముంగి॥ నీవెవ్వడవురోరి। బలుకావరంబునను వేవచ్చి। లావెచ్చి న్యా యహీనుడవునై ॥నీవె॥ వావిరిగను నన్ను క్రిందవొంచ్చియు వాహ సంబునేల గొంటివివ్వుడు। యేవిధంబునైతునీవుసేసెదవు ॥ యెంత వాడ వీవుచూడ ॥నీవె॥౧॥

వ॥ ఒరేనీచా నీవెవ్వండవు నీనామంబేమి అన్యాయంబుగ నన్నుయశ్వం పైనుండి తదశ్వంబును గ్రహించితివి. ఇట్టి నీకురుచ్యోగంబునకే నెట్లుసహింతును నిన్నిదే సమరతలంబున సమయించి నాయశ్వంబే ను గ్రహించెదగాక॥

శివ॥ నేవీరశేఖరుడా। ననులాఘ్రులాప్రగను। నీవింత। యీవింతలైన మాట లాడెదు ॥నేవీ॥ కేవలముగ నిట్టివాహనముచే యీవసుధనుజయ గొంది గర్వము చే వసించియున్ననిన్ను శిక్షయు జేయనింపు జేరి తింపు ॥నేవీ॥౨॥

వ॥ ఒరే రాజాధమా నీవీ యశ్వమూలంబుననేకదా సర్వదేశంబులు జయింపి నేనె శూరుండవని గర్వించియుండుట అట్టినీగర్వం బణంచ నేనీకార్యంబుంజేసి నీయశ్వంబును గ్రహించితిని నే నెవరనుకున్నా

ముంగి. ఐతేమి భయమేమున్నదిరా! ఓ పాతకాధము సు! నీకింత నీకింత లేక వదరుచుంటివి! ఐతే। భూతలమున నిన్నుమచ్చరాపడిచేత దున్నికీర్తిగాంతునాసరి నేతయున్న డెందుసీవన నెంతసాగు నెగురబోకు 'ఐతే' ౩'

వ॥ ఒరే నేను శివకటాక్షంబువడసిన శివకుమారుండనని గర్వించిసికు-చున్ననే భయంబునొంది వాడగాను నిన్నీతక్షణంబున మచ్చరపరుల పరలచే మర్దించి జయంబుగాను వాడ చూకుచూడుము నా ప్రతాపంబు తియేకాదు.

శివకుమారుడు (తనలో)

వ॥ ఓహో! వీనితోనేను వృథావాదించుచున్ననేమి లాభము మేము వేగిరంబునం బోవలసియున్నదిగదా మంచిదినేనిదేసమ్మోహనాస్త్రంబునేసి వీనిచతురంగబలంబునంత మూర్ఛాగతులంజేసెదగాక (అని ప్రకాశముగా) ఒరే నృపాధమా,

నీతో వివాదించి। దుర్మతిచిత్తగా॥ లాతీత। మానేత జేసికొనగనేలను ॥నీతో॥ యీతరియును నిన్ను సేననంతయు నిపుడుమూర్ఛనొందజేతుకనుమిదో। ఖ్యాతిమీర పెద్దకొట్టుపురిశితి। కంతుసాక్షి। కపట కుక్షి ॥నీతో॥౪

వ॥ ఛీ దుర్మార్గ! ఇదేమదీయ సమ్మోహనాస్త్రంబున మిమ్మందరి మూర్ఛాగతులంజేసెద చూడుమూడుము (అని సమ్మోహనాస్త్రంబునేసి మూర్ఛనొందిరించినంత కొంతవడికి తెలివొందె)

ముంగిరాజు (తనలో)

వ॥ అబ్బా! వీనిబలంబెంతన వచ్చును మమ్మిందరను మూర్ఛనొందించెనుగదా ఇగవీని జయించ వశంబుగాదు దీనికొక్క యుక్తిబన్నెద అదెటులన మతుపమాత్రియగు చంద్రావతిని మృషచేక వీనికినివాహంబుచేసి దానికడ కంపెద ఆంపిన దానిచే వీడుహతంబౌను అదెటులననా బిడ్డకొంతమంది పురుషులన్నైన నిష్టపడనందున నొకమేడ గట్టించి దానినందుంచి నిత్యమొక పురుషుని వంతుగా బంపుచుంటిని పంపినవాడెల్ల

జచ్చును అప్పుడు నామదిసంతోషమౌను ఇది మంచియుపాయమేకదా అటులనే జేసెదగాక (అని ప్రకాశముగా) ఓయీ శివకుమారా దేవతలనైననోడించు బలంబుగల నిన్ను నోడించ నావశంబపునా ఇదో నీతోసంధికోరుచున్నవాడ మన్నించుము।

శివకుమారుడు (తనలో)

వ॥ ఓహో! నాధాటికోపక యీమంగిరాజు క్షమాపణము గోరుచున్నాడుగదా మంచిది మన్నించెదగాక (అని ప్రకాశముగా) మంగిరాజా ఇకనీమదిభావాంతంబు మానుము నిన్ను మన్నించితిని।

మంగిరాజు.

వ। మంచిది శివకుమారా ఇటువినుము.

క॥ వినుమోయి శివకుమారక అనువుగ నాప్రతిజ్ఞచ్చి యరణంబుగ
నీ । కనుయీయశ్వమునిచ్చెద గనియిది గొనభంగపాటు గద
నాకిలలోన్॥

వ॥ శివకుమారా! బలాత్కారంబున నీవీయుత్తమాశ్వంబును గొనిపోయిన నాకవమానతనేగదా కావున మత్కుమార్తెయగు చంద్రావతిం నీకిచ్చి వివాహంబుచేసి యీయుత్తమాశ్వంబును యింక నాకుంగలుగు వన్నెలకుగుర్రంబులలో సగంబును నీకరణంబుగా నిచ్చెదను అటులైన నామది సంతోషమౌనుగదా॥

శివకుమారుడు.

వ। మంచిది అటులనేకానిమ్ము నేసమ్మతించితిని॥

మంగిరాజు.

వ॥ సరి రారమ్ము నీభార్యాద్వయయుక్తముగా మద్గృహంబునకేగుదము॥

వ! పాపమ్మ (అని నిష్క్రమింతురు)

చంద్రావతి ప్రవేశము.

దర్వు—యేకతాళము.

చెలి చంద్రావతి నేనోయమ్మా ! లలితేందు ముఖిననమ్మా ॥చెలి॥ సలలితగుణ మంగిరాజు యస్మజ్జనకుడమిత కీర్తివంతురాలను। విలసితాబ్జ పత్రి

నిమహో?జ్జ్వలిత నీలభృంగ కుంతలిసి ॥చెలి॥ ననుగాంచి పెంచినట్టి। జన కుండు నాకునిట్టి ॥నను॥ కనక మేడగట్టి యందుసుంచియుదిన దినంబునొ కనిబంపు బంపినసను రమింపవచ్చువాడు నీల్గునెవనితొ సుఖమునెన్న డె రుగనిక ॥చెలి॥౨॥ ఇదియేమొ చిత్రమమ్మా మదికేమిదోచదమ్మా ॥ఇది॥ సదయుడైన పెద్దమెట్టపురి సత్సదనుడాబ్జశేఖనుండు నాయందుదయద లచుడెన్నడో మరియునాకుదగు పురుషుగందునెన్నదో ॥చెలి॥ ౩!

వ॥ నెచ్చెలీ మజ్జనకుండగు ముంగిరాజు నాయిష్టమైన పురుషుని దెమ్మని వేడినందున నెందరినో రాజులపటంబులుం దెప్పించిచూపించి ననే సమ్మతించనందున విసిగి నాకొకబంగారు మేడగట్టించి యందున న్నుంచి దినమాన మొక పురుషునిబంపిన నావద్దకి వచ్చి వెంటనే మర ణించును ఇది యేమిమాయనో కాని తెలియదు వచ్చిన పురుషునితో సుఖమన్నమాటయే లేదు ఇంతపర్యంతరము బ్రహ్మచారిగనే యుంటిని ఇందుల కాపరమేశ్వరునియను గ్రహమెప్పుడు వచ్చునో నాకుందగిన పురుషుడెప్పుడు దొరుకునో తెలియదు గదా॥

చెలికత్తె.

వ॥ అయ్యొ చంద్రావతీ! నీవనుమాట నిజమేకాని నీజనకుండెందుల కోరమ్మని యెనట పోదమురమ్మా॥

చంద్రావతి.

వ॥ సరి పోదముపదమ్మా (అని తండ్రింజేరినంత)

ముంగిరాజు.

వ॥ అమ్మాయియా చంద్రావతీ! యీశివకుమారుని నీకు వివాహంబుజేసె దను జేసికొని యెదవా.

చంద్రావతి.

వ॥ యేమెమో విచిత్రము (అని తనలో) వెట్లుండనైరి యీతడు నిశ్చ యమా॥

ముంగిరాజు.

వ॥ శివకుమారా! ఇదిమేనా పుత్రికయగు చంద్రావతి ఊనింబ రిణయంబాదుము.

శివకుమారుడు.

వ॥ చిత్తము (అని నింత వివాహంబుం జేసి)

ముంగిరాజు.

వ॥ శివకుమారా! నీకు వివాహంబు జేసితిని నాగబలికుడా ఆయ ను కావువ నేడీ చంద్రావతియుంను మేడమీాదికింబొమ్ము సాయంత్రి మైనది.

శివ కుమారుడు.

వ॥ మంచిది! పోయెదను (అని పద్మావతితో) పద్మావతీ నన్ను ముంగిరాజు చంద్రావతి మేడమీాదికిబొమ్మని యంచున్నాడుగదా పో దునాయేమి.

పద్మావతి

వ॥ పొమ్ము! గాని సాయంత్రిము తెల్లనా రేపర్యాంతరము పవ ళకుము జాగ్రితగా నుండుము.

శివకుమారుడు.

వ॥మంచిది నేబోయెదను (అని చంద్రావతి గృహంబుంచేరి యున్నంత)

చంద్రావతి.

వ॥ మనోహరా! రమ్ము మత్పర్యాంక మెక్కుము,

శివకుమారుడు.

వ॥ సరి అటులనే నీపాను పెక్కితిని॥

చంద్రావతి.

వ॥ ఇదో విడియమందు కొనుము.

శివకుమారుడు.

వ॥ అందుకొంటినిగాని పవళించుచు నేపడుండియుంటిని (అనికతటనిద్రి బోవును)

చంద్రావతి (తనలో)

వ॥ యేమి! యీాపురుషుండు పవళించినంతనే గాఢానిద్రి జెందెనుగదా

మేల్కొల్పధర్మంబుగాదు నేనుకూడా నిటిగ్రించెదను (అనిగాఢానిద్ర పోవుచున్నంత)

శివకుమారుడు లేచి (తనలో)

వ॥ యీమె గాఢా నిద్రపోయినది నేను లేచి మేల్కొనియుండెదగాక (అని లేనియొకచోట గూర్చుండియున్నంత చంద్రావతి ముక్కులో నుండి.

సర్పము ప్రవేశించి (తనలో)

వ॥ హా! దైవమా నేసర్పరాజమనై యీచంద్రావతి ముక్కులోని నాసముగానుండి యెన్నియో దినంబులాయను అన్ని దినంబులనుండి యీమె ప్రక్క లోనే నాకాహారంబు దొరికిజీవింపుచుంటిని నేటెదినమెంత దుర్దినమో కాని యీమెప్రక్కలో నెవ్వరు లేరుగదా ఇగనాకేమిగతి చింతేమున్నది మీమేడదిగి యెచ్చటికైనబోయి యాహారంబ నుభవించివచ్చెదను (అని మేడదిగిపోవుచున్నంత)

శివకుమారుడు (తనలో)

వ॥ అబ్బా! ఇదియేమి విక్కల్పము యీమెముక్కులోనుండి వెళ్లినయీసర్పమే సమస్త జనుల సంహరింపుచున్నది నన్నుకూడా జంపునోయేమో అబ్బా యీముంగిరాజు కపటమేమనవచ్చును మంచిది భగవంతుడున్నాడు అయినా దీనివెంటనంటిపోయి దీనిచిత్రంబుం జూచెదగాక (అని సర్పమువెంటనైకె నీడబోవుచుండె నంత)

ఆదిశేషుడు ప్రవేశించి (తనలో)

వ॥ ఓహో! నేనాదిశేషుండనై మీముక్తీశ్వరస్వామి గుడిముందరనుండబడు శివకుమారునిద్రవ్యముమీద పుట్టచెట్టుకొని దానికావలిగానుంటిని యుండి యీముక్తీశ్వరుని నమీపించి నమస్కరించి వచ్చువాడుక యున్నందున నేనిప్పుడచ్చటికి బోవుచుంటినిగదా (అని పోవుచున్నంత)

సర్పము ప్రవేశించి.

వ॥ ఓహో! స్వామీ నీవెవ్వడవు నీవెచ్చటికి పోవుచుంటివి నీవు పోయే స్థలములో యేమైన యాహారము దొరుకునా యేది వచింపుము.

ఆదిశేషుడు.

వ॥ ఓసర్పమా నేనాదిశేషుండను। యిచ్చట శివకుమారుని ధనంబుండుటనుచే దానిపైనపుట్టబెట్టుకొని। తద్ధనంబుగాపాడు చుంటిని। యీశివకుమారుండెప్పుడు వచ్చునో। యీధనంబెప్పుడు దీసికొని పోవునో। ఇదిదీసికొనిపోయిన వెంబనేనాకు స్వర్గముదొరుకును గదా। అంతపర్యంతరము కాపాడుకొని యుండెద। యిప్పుడీముక్తీశ్వరుని దర్శనార్థమై వెళ్లుచున్నాను (అని నిష్క్రమించును)

సర్పము.

వ॥ అయ్యో యీనాడు నాకెచ్చట నాహారంబు దొరుకుటలేదు నాస్థలమునకేను బోయెదగాక (అని మేడమీదికి పోవుచున్నంత)
శివకుమారుడు (తనలో)

వ। ఇప్పుడీ సర్పమీచంద్రావతి ముక్కుచెవిమెడలోకి పోవుచున్నది పోయినమళ్ళి దొరుకుట కష్టము కావున దీనిజంపెదగాక (అని వజ్రాయుధంబుచే జంపి) యీపాము జచ్చినది యింకయేభంగము వాటిల్లునో జాగ్రతగానుండెదగాక (అనిజాగ్రతగా మేల్కొనియున్నంత)

మాయరాక్షసుడు ప్రవేశించి.

మత్తకోకిలము.

మాయరాక్షసుడ నేను మరిగానివెమార్గమున బడిపోయి భూ। నాయకాత్మజమైన యాచంద్రావతింటికి నేగి ని। త్యాభిలంబుగనుండు పీనుగనట్టి భక్షణజేసెద। చేయవాడుక నుండెగావున శీఘ్రమేనిపుడేగెద॥

వ॥ కావున మాయరాక్షసుడనై దినయాననమా చంద్రావతి మేడమీద పడియున్న శవంబును దీసికొనివచ్చి భక్షించి నాకుక్షినింపుకొనువాడుకయుండెను కావున నేనిప్పుడచ్చటికిం బోయెదగాక (అని

శివకుమారుడు (తనలో)

వ॥ అబ్బా! ఇదియొక పిశాచ మొచ్చెను గదా ఇదియెవ్వరుగావచ్చు ను (అని సమీపించి పరికాశముగా ఒరే నీవెవ్వడవురా! రాజాంతః పురంబున కొచ్చిన కారణంబేమి నిన్ను శిక్షించక మానను చూడుము ఇదే వజ్రాయుధంబున నీకుడిభుజంబును నరికివైచెదను (అని నరికినంత)

మాయ రాక్షసుడు.

వ॥ అయ్యో నేనిచ్చటికి యెందుకొచ్చితి వచ్చినందులకీ వీరుండీవ లోకాని నాకుడిచేయి తెగవేసెనుగదా హా! దైవమా! యీమంట కో పజాలను వెళ్లెదగాక (అని నిష్క్రమించుచు) (అంత తెల్లవారిన)

చంద్రావతి శివకుమారునితో.

వ॥ నాథా! నేడుగదా నాభాగ్యము ఫలించినది నీవునాయందు గలమాయను జయించి నామనోరథంబు సఫలంబుజేసితివి నేనెంతో ధ న్యురాలనైతిని గదా.

శివకుమారుడు.

వ॥ చంద్రావతీ మీరాజనకుండు జేసిన కపటకృత్యంబుం జూచితివా నన్ను చావ నెంచెను గదా (అని అనుచుండగాలో)

మంగిరాజు ప్రవేశించి.

వ॥ శివకుమారా! నాతప్పుక్షమించవలసినది నేనెంతో యపరాధినైతి ని నీవిట్టి మహానుభావుండవని తెలియనుగదా.

శివకుమారుడు.

వ॥ మంచిది రాజా! కానలకార్యంబు కాకతీరునా ఇందుకు చింతించిన నేమి లాభము యూరొకొనుము.

మంగిరాజు.

వ॥ మంచిది సదయహృదయత్వంబెంతన వచ్చును అయినా ఇదో నావన్నె లకుగురింబులలో సగంబును నేనెక్కుయుత్త మాశ్వంబును ఇంక ననేకదా సదాసజనంబులును నీకరణంబుగా నిచ్చితి వీటింగైకొనియీ చంద్రావతి సమేతంబుగా నీరాజ్యంబునకేగి సుఖంబుగా నుండుమా

శివకుమారుడు.

వ॥ మంచిది అటులనే పోవుచున్నవాడ (అని పద్మావతిం జేరి) పద్మావతీ యిదే మునిరాజు తన పుత్రియగు చంద్రావతి నిచ్చి యుత్తమాశ్వంబు నొసంగి యింకనెంతో యరణంబుగా నిచ్చి పంపినడు చూచితివా॥

పద్మావతి.

వ॥ మనోహరా! సౌభాగ్యమే భాగ్యము యింకకా శివకటాక్షమే మూలము గదా॥

శివకుమారుడు.

వ॥ పద్మావతీ! యీనాము శ్రీశ్వరుని గుడియందర నాద్రవ్యమున్నదనినా గేంద్రుడు చెప్పినాడు నావున యీపుట్టదగ్గరకు పోదముపమ్ము॥

పద్మావతి.

వ॥ సరి అటులనే పోదము పమ్ము (అని పుట్టకు సమీపించినంత)

శివకుమారుడు నీలావతితో.

వ॥ నీలావతీ! యీపుట్టలోనుండు ద్రవ్యము మనకు వచ్చుటెట్లు.

నీలావతి.

వ॥ యెట్లేమున్నది యీపుట్టలో నాకంటినీరు వసిసిన్నముగాజేసి యీనాగేంద్రుని బైటకువచ్చే అట్లుజేసెదను (అని యట్లుజేసి నంతపుట్టలో నుండి)

ఆదిశేషుడు వెళ్ళి.

వ॥ మహాశయా! శివకుమారా మీద్రవ్యము మీరుదీసికొని నన్నుస్వర్గమునకంపుడు నేబోయెదను.

శివకుమారుడు.

వ॥ మంచిది! నాద్రవ్యము నేనుదీసికొనియెదను (అని ద్రవ్యముదీసి సంతనాగేంద్రుని మరణించినంజూచి తనలో) యేమి నేనీద్రవ్యంబు నుండీసికొనినంత మాత్రంబుననే యీయాదిశేషుంటు మరణించెను గదా దీనికిది హానాదికృత్యంబులుంజేసి స్వర్గంబునకంపెదగాక (అని యట్లుజేసి పద్మావతితో ప్రకాశముగా) పద్మావతీ యీయాదిశేషుని నాగలోకంబున కంపితిని యీద్రవ్యమంత బ్రాహ్మణోత్తముల

పద్మావతి.

వ॥ నాథా! అటులనే పోదము కండు (అని వెళ్ళి) మనోహరా ఇదే బ్రహ్మ విలోచనుని యగ్రహారసమీపంబున నొకశివాలయమున్నది అందు నివసించి యాలింగమూర్తి నిపూజించి మరునాడావలికిం బోవమరమ్మ

శివ కుమారుడు.

వ॥ మంచిది! ఆలాగే పోదము పదమ్మ (అని నిష్క్రమింతురు.

అగ్రహారము

బ్రహ్మవిలోచనుని ప్రవేశము.

దర్వు—యేక తాళము.

బ్రహ్మవిలోచనుడా! నేనూ ॥బ్రహ్మ॥ బ్రహ్మకులీనుడు పరతత్వజ్ఞుడ బ్రహ్మసుతత్వపుడా నేనూ ॥బ్రహ్మ॥౧॥ నిరతముషట్కర్మ్మతుడనై నే బరియింతుచు నెపుడూ నేనూ ॥బ్రహ్మ॥౨॥ ధారుణి పెదమెటుపారీశ్వరుమది కోరిభజించెదనూ నేనూ ॥బ్రహ్మ॥౩॥

వ॥ హా! దైవమా మాయగ్రహారమున కెంతయు పద్రవము జరుగుచున్నది. అనుటులన యొకరాక్షసుడు దినమూన యిచ్చి మాగ్రామంబునంగల కన్యకలనందరి వంతుకొలదిగా నిత్య మొకదాని నెత్తుకొని పోవుచున్నాడుగదా యీయుపద్రవ మెన్నడు మానునో మేమెన్నడు సుఖస్థితినుందుమో తెలియకుగదా (అని యోచించిచూచి) అదిగో మాగ్రామసమీపంబుననుండు శివాలయముపద్ద నెవరో మహాసేనాసమేతముగా వచ్చి విడిసియున్నారు. నేనచ్చటకేగి చూచెదగాక (అని పోయి శివకుమారుంజూచి) యేమి యీపురుషుం డెవరోకాని నిత్యలింగపూజాధురంధరుండుగానున్నాడు యీతనిచే మాపురోపద్రవము మానునట్లు తోచుచున్నది. యేది సమీపించి విచారించెదగాక (అని శివకుమారుం జేరి) అయ్యా! మహానియా

వాదము—యేక తాళము

బ్ర॥ వోపుణ్యపురుష వినుము నేనీ యూరివాడ బ్రహ్మవిలోచనుడను ॥వోపు॥ యీపురంబునందుగలుగు యాపదబాపవిన్నునే

వ॥ అయ్యా! పుణ్యమూర్తివగు నీచేమాయగ్రహారంబంగలుగు యుపద్ర
వమమానునని నీబలవిశేషంబులంగురించి ప్రార్థింపుచుంటిని కావున
మాయాపదలు బాపి రక్షించనీవేయర్హుండవు కాని యింకొకరుల
చేకానేరదు నేనెవ్వరంటి యీయగ్రహారాధిపతినగు బ్రహ్మవిలో
చనుండను బ్రాహ్మణుండను.

శివ కుమారుడు (తనలో)

వ॥ యేమి! హఠాత్తుగా యీబ్రాహ్మణుండువచ్చి మమ్ములరక్షింపుమ
ని ప్రార్థింపుచున్నాడే పాపము యీబ్రాహ్మణునికింగలుగు యుప
ద్రవవేమో దీర్చిరక్షించెదగాక (అని ప్రకాశముగా) హోబ్రా
హ్మణోత్తమా యీపట్టునీకుగల్గు యాపదలేమొకానిచెప్పు బ్రా
హ్మణోత్తమ యీప శేషమాపుయనకనిపుడె నీదగుయాపదలను
దీర్చి తుక్షణములో ॥యీప॥౨॥

వ॥ బ్రాహ్మణా నీకుంగలయాపదలేమో చెప్పుము నేదీర్చగలను నేశివ
ప్రసాదంబున జనించిన శివకుమారుండను విన్నావా.

బ్ర॥ భూమీశచంద్రవినుమ మాపురికేమో కాని యొక్కరక్కలుండును॥
మీ॥ యేమరకనువచ్చినిత్య మొకకన్యామణిని గొంపోవుతప్పకను
భూ॥మీ॥ ౩॥

వ॥ ఓయీశివకుమారా! యీయగ్రహారంబునకొక్క రాక్షసుండల
వాటై దినమొకపడుచును గొంపోవుచున్నాడు అందుచే మాగ్రా
మమంత జనశూన్యమై పాడుబడ్డదైయున్నది కావున వానింబరిమా
ర్చి మాబాధమాన్పి రక్షించుము.

శివ భూమీసురేంద్రవినుము నీమదికేమి చింత సంతసంబునుండుము
॥భూమీ॥ అమదాంధుద్రుంచిమిమ్మ్మగాతును అవనిపెదమెపల్లిశివుని
కృప ॥భూమీ॥౪॥

వ॥ విప్రపుంగవా! నీచేవిన్నంతమాత్రములో యారాక్షసుండువచ్చి
వాడుగానెరుంగుము కాని వాడెచ్చటనుండునో చెప్పుము.

బ్రహ్మవిలోచనుడు.

వ॥ మంచిది! ఆలాగేగెప్పెద నిటువినుము.

సీ॥ ధరణీశయిచటికి దగమూడుయోజనం బులదవ్వునను నొక్క భూద

రంబు గలదందు గంధర్వ కన్యకామణియు పుణ్యావతితపమ్ము నాచరించు చున్నది. మాయారాక్షసునిజంపుధీరుని పరిణయంబొదంచు ప్రతిజ్ఞబూని యున్నతామెనిమిత్త ముర్వీశ్వరకుమారు లెందరోభంగంబు నొందిపోయిరి గానసీవేగియచట రక్కసునిద్రుంచి పెండ్లియాడుము యామెతో పెర్మితోడ నామెవద్దననేక విద్యలునుగలవు పొమ్మువిజయమగును నీకునోపుణ్యమూర్తి॥

వ॥ శివకుమారా ఇచ్చటికిమూడుయోజనబుల పెట్టునవొక తింత్రిణి యను పర్వతంబుగలదు దానియందునొక యేకస్థంభముమేడగట్టించి దానిలో గంధర్వపతియగు గయునికుమార్తెయగు పుణ్యావతిని దెచ్చి మాయారాక్షసుండుంచినందున యామెయా రాత్రాపతంబున నీరాక్షసుని యెవ్వరువధింతురు వారిని వివాహంబుజేసి కొనిమెదనని ప్రతిజ్ఞబూని శంకరునిగురించి తపంబుజేయుచున్నది కావున నీవిప్పుడచ్చటికేగి యారాక్షసునివధించి యామెనుపెండ్లియాడుము పొమ్ము జయంబగును.

శివ కుమారుడు.

వ! మంచిది! బ్రాహ్మణా కొందరొందకుము నేబోయి వానివధించి మీనాకార్యంబులు నెరవేర్చుకొని వచ్చెదను (అని పద్మావతి తో) పద్మావతీ నేనీబ్రాహ్మణవిలోచనుని భాధనివారించుటకై తింత్రిణిపర్వతంబునకేగి యారాక్షసునివధించి పుణ్యావతిని పెండ్లియయ్యివచ్చెదను శెలవొసంగుము.

పద్మావతి

వ॥ మంచిది! మనోహరా బ్రాహ్మణోపద్రవము మాన్పుటధర్మమేకదా కావున పొమ్ము యారాక్షసునివధించి పుణ్యావతిని పెండ్లిజేసికొని రమ్ము.

శివ కుమారుడు.

వ॥ సరి! పోవుచున్నవాడ (అని తింత్రిణిపర్వతంబునకు బోవుచున్నంత)

మాయరాక్షసుడు (తనలో)

వ॥ ఓహో! నేడేమోకాని యొక్కమానవుడిక్కడికి విచ్చేయుచున్నాడే

మంచిది రానిమ్ము వచ్చినతోడనే భక్షించెదగాక (అని అనునంతలో శివకుమారుండువచ్చి సంజూచి) అబ్బా! యీతనిభీకరాకారంబుంజూడ నామదిభయమగుచున్నదిగదా నేనిపుడొక బ్రాహ్మణవేషధారినై యాతనివద్దకరిగి మోసపుచ్చిచంపెదగాక (అని బ్రాహ్మణ రూపకబునంబోయినంత)

శివ కుమారుడు (తనలో)

వ॥ ఓహో! యీవచ్చుబ్రాహ్మణుండు రాక్షసుండాయేమి కావచ్చును రాక్షసులు కామరూపులుగదా బ్రాహ్మణుండైతేకాదు సరిమంచిది భయమేమున్నది.

పంచచామరము

బయంబదేల నాకువీనిపై నిరేడురాళ్ళలో వ్రియంబునయ్యె మూడురాళులందు నొక్కరాయినే రయంబునక్షమరే సిగర్వరాశినెల్ల నొంచిన ప్రియంబునంధరాసు రేంద్రభీతినెల్లబాపెదక

వ॥ కావున। మున్నాపద్మావతి మంత్రించియిచ్చినయేడురాళ్ళలో మూడువ్రియమైనవి తక్కినరాళ్ళలోనిపు డొక్కరాయిందీసి వీనిపైనేసెదను అప్పుడు వీనిసంగతితేటపడగలదు (అని యొంరాయివేసినింత బ్రాహ్మణరూపమువదలి

మాయిరాక్షసుడు గడగడవడంకుచు

(తనలో)

వ॥ అబ్బా। యీతనిప్రభావం బెంతనవచ్చును నేనేయంటె నాకంటె యెక్కువగానున్న డే యీతనిజయించినా వశంబుగాదు సంధిచేసికొనుటమేమంచిది (అని ప్రకాశముగా) ఓహోమహాత్మా నీకిదేనమ నమస్కరించెదను నన్ను రక్షించుము.

శి వ కు మా రు డు (త న లో)

వ॥ ఓహో। యీరాక్షసుడు నాధాటికోపక శరణాగతుడైయున్నాడే పాపము రక్షించెదగాక (అని ప్రకాశముగా) ఓయీ నీవెవ్వరోచెప్పుము నిన్నురక్షించితిని.

మా యా రా క్ష సు డు

వ॥ అయ్యా। చెప్పెద వింటువినుము.

ఉ॥ నేనొకమాయరాక్షసుడ నెన్నొదినంబుననుండియీగిరి స్థానుడన య్యెయెుక్కదివసంబునగంధర్వపులోకముక్ పూనియు నేగియాగయుని పుత్రికనెత్తుకవచ్చియిచ్చటన్ యగుమమానకపెండిలిదానినిప్పుడున్

వ॥ స్వామీ। నేనుమాయరాక్షసుండను వొకనాటిదివసమందా గంధర్వ లోకంబునకేగి గంధర్వరాజగు గయునికుమార్తెయగు పుణ్యావతిని దెచ్చి యీపర్వతంబున నేకస్తంభముమేడ గట్టించి దానినందుంచితిని కావున తానిప్పుడొసంగి వివాహంబుజేసెదను రమ్ము మాగృహంబునకేగుదము.

శి వ కు మా రు డు.

వ॥ సరిమంచిది। (అని నిష్క్రమింతురు)

పు ణ్యా వ తి ప్ర వే శ ము.

దర్వు—రూపకము.

నానామముపుణ్యావతి నమ్మావినవమ్మాచెలి ॥నానా॥ సూనాస్త్రనిరరనమాన సుందరినింమనిభోస్యను ॥నానా॥౧॥ గంధర్వాధిపుడగుమా గయనామడు మజ్జనకుడు ॥గంధ॥ గంధేభసుదాననిలస కలవిద్యలుగలదానను ॥నానా॥౨॥ ధారుణిపెదమెుటుపల్లి ధాముండగుశివునినామ ॥ధారు॥ పారాయణమెునరింపుడు కరమతపంబును చేతును ॥నానా॥౩॥

సీ॥గంధర్వపతియైన గయునికుమార్తెనై యున్ననోర్వకనొక్కనాడు మాయరాక్షసుడొచ్చి మాయలుబన్ని నన్నెత్తుకొవచ్చియీయిలధరంబు। మీదైకస్తంబంబు మీదైకస్తంబంబు మేడగట్టించియు నందునునుంచెనే నంచితముగ। దుర్మార్గుడవుపీని దునుమాడువానినే పరిణయంబొదంచు ప్రీతినిబూని। శివునిగూర్చియు తపమునెచేయుచుంటి గానతత్కరుణనాయందు గలుగునెపుడొ నాదుకోరిక సఫలంబునౌనదెపుడొ యంచునెదిరిచూచుచునుంటినమ్మకొమ్మ.

వ॥ కావున శివకటాక్షము నాయందెన్నడువచ్చునో నాకోరికెకెన్నడు ఫలించునో తెలియదుగదా (అని తర్కించుచున్నంత)

మాయరాక్షసుడు శివకుమారునితో

వ॥ అయ్యా! ఇదియేపుణ్యావతి చూచితివా

శివకుమారుడు.

వ॥ చూచితిని (అని ఆనువంతలో)

పుణ్యావతి తనలో.

వ॥ ఆహా! యేమి యీరాక్షసకుమారుని సౌందర్యాది విశేషంబు లెన్న నలవిగాకున్నదిగదా యీతండు నాభర్తయైనచో బాగుండును గదా.

(అని ఆనువంతలో)

మాయరాక్షసుడు శివకుమారునితో

వ॥ ఓయీ! రాజా మనమొకసారి చతురంగమాడుదము రమ్ము ఇది నీకిష్టమేనా.

శివకుమారుడు.

వ॥ మంచిది! ఆడుదముపటము పందెము వేయుము.

మాయరాక్షసుడు.

వ॥ ఇదో! పందెమువేయుచున్నాడ చూడుము (అని యెడమ చేతితో పందెమువేయుచున్నంత)

శివకుమారుడు.

వ॥ ఓయీ! రాక్షసేంద్రా నీవుయెడమచేత పందెమువేసెద వేందుకు కుడి చేత వేయుము.

మాయరాక్షసుడు.

వ॥ అయ్యా! నేనేమి చెప్పుదును నేనొకనాడు మంగిరాజుయింటికి యీహారంబునకై వెళ్ళిన నచ్చెవడో నా కుడిచేయి తెగ వేసెనందున నేనీయెడమచేత నాడుచుంటినిగదా.

శివకుమారుడు.

వ॥ ఓహో! నీవేనా ఓయిరాక్షసా నీచెయ్యి తెగవేసినవాడను నేనే శివకుమారుండను అప్పుడునిన్నిట్లుజేసి యీమంగిరాజుకుమారై యగు చంద్రావతిని పెండ్లియాడితినిగదా.

మాయరాక్షసుడు (తనలో)

వ॥ అబ్బా వీఁడు నాశత్రుఁడు వీని ద్రుంచ గూడదు ద్రుంచెదఁ గాక (అని ప్రకాశముగా) ఒరే మానవా॥

పంచచామరము.

మరెంత జేసితౌర నీవు మానవర్ నినచ్చుటన్ । కరంబు గోసి వైచి
నట్టు క్రౌర్యచిత్తనిర్భయా । [illegible]రంబునందు ద్రుంచి నేడు దో
లుకున్ కృతాంతమందిరంబుకున్ మరేమిచింతదీరె నిపని పు
డున్॥

వ॥ ఒరే నన్నెంత మోసపుచ్చితివిరా । నేనెవరంటే । నాకన్న బహు మాయావాదివిగదా యిఁక నిన్ను బ్రతుకనిచ్చునది లేదు । నా చేజిక్కితివి నిన్ను మర్దించెదగాక.

శివకుమారుడు.

వ॥ ఒరే పాపిష్టి! మదాంధా.

పంచచామరము.

ఒరే ఒరే మదాంధరాక్షసోగ్రక్రూరకర్మని దురోక్తులున్ సమీ
పకింద ద్రుంచుటనిన్ను సంగరంబునందు పారి పోవగాను బోవన్నీకంమరిన్
నినున్ వధింతుచూడుమా మకప్రతాపమున్

వ॥ ఒరే! రాక్షసా ఇకనివు బ్రతుకజాలవు తమాతావిత్యులందలంచు కొమ్ము.

మాయరాక్షసుడు (తనలో)

వ॥ ఓహో! ఇట్లుగాదు వీని నాకాశంబుపై నెగరవైచి చంపెదగాక (అని ప్రకాశముగా) ఒరే నరాధమా ఇదే నిన్ను బట్టి నా మాయాబలంబున గగనమార్గంబున కెగరజిమ్మెద చూడుచూడుము నా బలంబింతియే కాదు (అని దొరకబట్టి యాకాశముపై నెగరవేసినంత)

పుణ్యావతిచూచి (తనలో)

వ॥ అబ్బా! యీశివకుమారుని బలపరాక్రమంబె.తనవచ్చును యిఘుపీడువచ్చినడు నాకో రె-ఫలించినది నేనీతనివరించెదగాక (అని ప్రకాశముగా) మహాత్మా శివకుమారా నేను నాభాగ్యముఫలించినది నెనన్నమాటచెల్లినది కావున నీవేనాభర్తవు ననుగాంధర్వ వివాహంబాడుము.

శివకుమారుడు.

వ॥ మంచది పుణ్యావతీ నిన్నిదే గాంధర్వవివాహంబైతిని ఇంకనిందుండనేల రారమ్మా నాముప్వురు భార్యలసమీపంబున కేగుదము.

పుణ్యావతి

వ॥ చిత్తము నాథా! అటులనే పోదము పదమ్మా (అని నిష్క్రమించి)

శివకుమారుడు పద్మావతితో.

వ॥ పద్మావతీ ఇదేయారాక్షసుని జంపి బ్రహ్మవిలోచనునికి క్షేమముజేసి యీపుణ్యావతిని పరిణయమైవచ్చితిని కావున మనమిందుడనేల యిదే పుష్పకముపై మనమైనురమెక్కి మాతల్లియున్న బావిదగ్గరకు పోదము పదుండు॥

పద్మావతీ.

వ॥ మంచిది అటులనే పోదముపదమ్మా (అని కొంతదూరమేగి నంత)

శివకుమారుడు.

వ॥ పద్మావతీ ఇదియేమి చిత్రము యీయరణ్యమార్గములో మొసలుకలచుట్టు గోవులల్లిబిల్లిగా చుట్టుకొని బహుగాదుఃఖించుచున్నవి కారణంబేమి.

పద్మావతి.

వ॥ మనోహరా! ఒక వ్యాఘ్రము యీగోవుల రక్షణీయముగావర్తించుగోరాజమును భక్షించినందున తమప్రభువునుంబాసి పోజాలకయీగోవులన్ని యామొసలుకల చుట్టుదిరుగుచు సాలావిలపించుచు

శి వ కు మా రు డు.

వ॥ అయ్యో పాపము యీగోరాజమును బ్రతికించిన బాగుండును గదా.

ప ద్మా వ తి.

వ॥ యేనిక్రిందబడ్డ యెముకకుల ప్రాణమెట్లు వచ్చును యెట్లు బ్రతుకును॥

శి వ కు మా రు డు

వ॥ యెట్లైయుగ దీని బ్రతికించననది మనమావలను బోరాదు.

ప ద్మా వ తి.

వ॥ మంచిది (అని నీలావత్యాదులతో) ఓ నీలావతి, చంద్రవతి పుణ్యావతులారా! వింటిరా మనమనోహరుని వాక్యము యీవచ్చిన గోరాజమును బ్రతికించి పోదామని బలిమిజేయుచున్నాడుగదా ఇందులకేమి విచారము॥

నీ లా వ తి.

వ॥ అక్కా! నీవిచారమే మావిచారము నీవేచక్కగా యోచించిచెప్పుము.

ప ద్మా వ తి.

వ॥ మంచిది ఇటువినుము.

చ॥ యెముకల నన్నిటిన్ నొకట యేనిక గూర్చెదయేను పాటుగన్.

నీ లా వ తి.

యెముకలపైని మాంసమును యేసుజనింపగ జేతునిక్కముగ్.

చం ద్రా వ తి.

క్రమమున మాంసముచేటను గ్రక్కున చర్మము బుట్టుజేతునే।

పు ణ్యా వ తి.

నిమిషములోన జీవనమును నేనునుబోసియు లేపుదీగవన్.

వ॥ మంచిది సోదరీ మణులారా అట్లులనే జేసి లేపుదముపదుడు. (అని మాగోరాజమును బ్రతికించినంజూచి)

శివకుమారుండు (తనలో)

కు,-వగా నున్నారుగదా!
చచ్చి వికలంబులైన యెముకల శకలంబులంగూర్చి యీగోవును బ్రతి
కించిరిగదా (అని ప్రకాశముగా) హేపద్మావతి ప్రముఖ నారీరత్నము
లారా మీరీగోవును బ్రతికించుటచే నామదికానందంబాయెను వాటి
కెల్ల సంతోషమాయను. యిగపోదాము పదండు॥

పద్మావతి.

వ॥ చిత్తము అలాగే పోదము పదండు. (అని గిరిజావతియున్న
బావిదగ్గరకు వచ్చుచున్నంత)

దొండరాక్షసుడు (తనలో)

వ॥ అబ్బా ఇక నేను బ్రతుకజాలను శివకుమారుండు వచ్చుచు
న్నాడే యీనేల బొయ్యారము లోపలికిబోయి దాగుండెదగాక (అని
దాగున్నంత)

శివకుమారుడు వచ్చి గిరిజావతితో.

వ॥ తల్లీ గిరిజావతితే ఇదో నీవన్న నాలుగువస్తువులం దెచ్చితీని
చూడుము (అని నీలావతీతో) నీలావతీ మాతల్లికా నాలుగు వస్తువుల
నిమ్మా.

నీలావతి.

వ॥ మరిచిది అట్టులనె యిచ్చెదను (అని పకపకనవ్వి మాట్లాడి
శాస్త్రపురాణాలు చదివి కన్నులసేవ పటిపి నాలుగువస్తువులం బుట్టిం
నంజూచి)

గిరిజావతీ (తనలో)

వ॥ అబ్బా ఇదెంతాశ్చర్యము నాలుగు వస్తువు లీమెయందే
యుత్పన్నమాయనుగదా (అని శివకుమారునితో ప్రకాశముగా) నాయ
నా శివకుమారా ఇటువినుము.

శివకుమారుడు.

వ॥ తల్లీ యేమివిచారము.

వాదము—యేకతాళము.

గిరి—నెనెమని తెల్పుదు తండ్రీ। యీవింతెన్న దెరుగ తండ్రీ ॥నెనె॥

మానుగ మీ జనకుండిటులా। ప్రాణజంప నిన్నెంచనిరా। విను
మూ। కనుమూ! అనుమానించక ॥నెనె॥౧।

వ॥ నాయనా యీవస్తువులు నాకెందుకు మీ నాయిన్నగారు
నిన్ను జంప యత్నించి ఈపని నాజేజేయించినాడు ఇదంత మీతండ్రియు
పాయమేకాన నాకెక్కడి తలనొప్పి యెక్కడి యామనము॥

శి వ కు మా రు ట.

॥ యేమి ఇదంత మాతండ్రిగారు జేసినిదేనా మంచిది తల్లీ॥
వోనాజనని సరేమంచీ। దీనాబాంధువునుగా నెంచీ ॥వోనా॥ మా
నాయన యెచటుండెనుగా। మది జెల్పుము నెవిందునిగా। తగు
నాయగునా ఈమర్యాదయు ॥వో॥౨॥
వ॥ తల్లీ మాజనకుండెచ్చటున్నడో చెప్పుము॥

గీ॥ వినుమీబొయ్యారములోనా। యునికి జేసియున్నడుగానా ॥విను॥
జనుమచటికి నీవునువేగా। జనకుడు నీకగుపడు బాగా। తనయా!
వినయా। ఘనదోర్బలయుత ॥విను॥ ౩॥

వ॥ కుమారా మీజనకుం డీనెల బొయ్యారములోనెయున్నా
డు. నీవచ్చటికేగిన నగుపడునుగదా॥

శివ॥ జనకుడు ఈలాగునజేయా। జగతి నెన్నడెరుగను వినయా ॥జన॥
పనిపూనియు పెదమెట్టుపురి। ఫాలాక్షుని కృపగలదుమరి। ఘన
మీ। దినము యనువున నాయను ॥జన॥౪॥

వ॥ జనని! మజ్జనకుండిట్లుజేయునని కలనైన దెలియనుగదా (అని పద్మా
వతితో.

ప ద్మా వ తి.

వ॥ వింతేమున్నది మీతండ్రిచాలాగ నాటికైన యిట్లుజేయడు। ఇదియే
దోమాయగానున్నది। చూచెదవెందుకు! నీకునేను మంత్రించిమి
నరాళ్ళలో నొకరాయి। యీనెలబొయ్యారములో ప్రయోగించు
ము। అచ్చట నెవ్వరున్నాగాని పట్టుకవచ్చును.

శి వ కు మా రు డు.

వ॥ మంచిది అటులనే ప్రయోగించెదను (అని యొకరాయెవేసినంత)

దొండరాక్షసుఁడు (తనలో)

వ॥ అయ్యో దైవమా! నేనేమి సేయుదు యీపాషాణమేమోకాని న న్నుదండనజేసుకుంటూ యీనేలబొయ్యారములోనుండి పైకి దీసుక వచ్చెనుగదా యీ శివకుమారుఁడు జూచిన నాకు భయంబగుచున్న ది ఇగయెట్లు (అని అనుచుండె)

శివకుమారుఁడు పద్మావతితో.

వ॥ పద్మావతీ నేనీరాయి (ప్రయోగించినంతలో మాతండ్రిగారు యీ నేల బొయ్యారములో నుండి వచ్చెనుగదా.

పద్మావతి.

వ॥ అట్లుగాదు నీవట్లుండుము (అని దొండరాక్షసునితో) ఒరే నీనిజరూ పంబుం జూపుము లేకయున్న బ్రతుక జాలవు.

దొండరాక్షసుఁడు (తనలో)

వ॥ అయ్యో ఇగయెట్లు నామాయబైట బడేకాలము వచ్చినదే ఇకనా నిజరూపము జూపనిదియూర్కుండజే అట్లులేదు చూపెదగాక (అని మాయరూపమువదలి ప్రకాశముగా ) అమ్మానాని నరూపంబుం జూడు ము నేదొండరాక్షసుండను గదా॥

పద్మావతి శివకుమారునితో.

వ॥ నాథా! చూచితివా ఇదంత యీరాక్షసుఁడు జేలిన కపట కృత్యమే ఇక వీని నుంచగూడదు నీవజ్రాయుధంబున ద్రుంచివేయుము.

శివకుమారుఁడు.

వ॥ మంచిది (అని దొండరాక్షసునితో) ఒరే! రాక్షసా కపటమానసీ॥

మత్తకోకిలము.

యెంత జేసితివోర నీమదికింత భీతియులేకబల్ బొంత రాక్షసమా యకృత్యము బోలునేయుటుజేయునీ వంతుబాపెదచూడు మోదకవాడి వజ్రశరంబునన్ । గొంతగోసి మమాయలబునకున్ నిన్నునిపుడంపె దన్.

వ॥ ఒరే దుర్మతీ ఇదేనావజ్రాయుధంబున నిన్నువధించుచున్నవాడచూ డుము (అని వజ్రాయుధంబున వావానింజాపివాని యుదరంబుజీరితా తకుమారుని యెముకలుండీసి పద్మావతితో) పద్మావతీ ఇదేరాక్షసు

ని జంపి మాతండ్రి యొముకవీ తనికడుపులోనుండి తీసితిని కావున మీరప్పుడా గోవును బ్రతికించినట్టులీ నాతండ్రియగు తాతకుమారు నిం బ్రతికించుడు॥

ప ద్మా వ తి.

వ॥ మంచిది అలాగే బ్రతికించెదము (అని బ్రతికించినంత)

తాతకుమారుడు లేచి గిరిజావతితో.

వ॥ మనోహరీ గిరిజావతి యిదియేమి వింత.

వాదము—యేక తాళము.

తా॥—ఇదియేమివింత ఇందీవరాక్షినేడు ॥ఇది॥ మదనాంగి మనమ్మరి యొంటిగానె యెదలేక వస్తి యెవ్వరింతమంది వీరు ॥ఇది॥అ॥

వ॥ మనోహరీ మనము జల బులకోసర మిద్దరమేయీబావిదగ్గర కు వచ్చితిమిగదా యిప్పుడింతమంది యెవరు వీరెక్కడినుండి వచ్చిరి ఇదంత చిత్రముగానున్నది గదా.

గిరి—హృదయేశనీకు యేమనంచు దెల్పుదిపుడు ॥హృద॥ మదరాక్ష సుండు మరియింతజేయ । నిదియంతనాయ ! యీశుమాయ దెలి యదాయ ॥ఉదయ॥

వ॥ మనోహరా! నెనెమది చెప్పుదు. నీవు నీరు కోసరమీబావి లోదిగి నంతలో దొండరాక్షసుడు నిన్ను మ్రింగి నీస్వరూపంబున వచ్చి నాతోరమింపనెంచి మనికుమారుండగు ఈశివకుమారునింజంప యత్నిం చియింతపని జేసినందున మనకుమారుని వలన నింతమందిచ్చటకువచ్చిరి. వీరు నలుగురు నీకొడండ్రుగదా॥

తాత॥ తగునెకు చేస్తి। తమ నేతలిపుడునీకు ॥తగు॥ మగనాని వయ్యి।

మరువానిబొంది। తగువెట్టమూని। తగసౌఖ్య మనుభవింప॥త! ౩॥

వ॥ ఛీనరాత్మురాలా! పరపురుష గమనంబుం జేసిన పాపాత్మురాల వగు నీవునాకుం బట్టదు. నిన్ను శిక్షించి వధించక మానను॥

గిరి॥ జగతీశచంద్ర! తగునె ఈలాగుజేయ ॥జగ॥ మగడంచునిన్నె। మరి మోహానే! నిగగోరియుంటి। నెరమేమి స్వామినాది ॥జగతీ॥౪॥

వ॥ మనోహరా! నీరూపంబున వచ్చుటచు వో నీవేయనినమ్మి దైవసాక్షిగా వానితో రమించింతిని ఇందులో నానేరమున్నది. నీవేవిచారించుకొనుము ।

తా॥ కుటిలాలకిని। వెటులన్నగాని నమ్మ ॥కుటి॥ మటుమాయకారి। మరి
దీనికొక్క। పటుశిక్షయైన! పరిగ్రహించువాడ నిన్ను ॥కుటి॥

వ॥ నారీ! నీకెన్ని జెప్పిన నామనసు ఒప్పదు! దీనికొక్క శిక్షనైనను నమ్మగలను. విన్నావా॥

గిరి॥ పటుచారుపెద్ద। మెట్టుపల్లి వాసుడేలు ॥పటు॥ యిటు నన్నుమీరు।
లెటుసేయుమన్న। నటుసేయుదాన। నానతివ్వ వలయునాథ।
పటు ॥ 2 ॥

వ॥ నాథా! దీనివిషయమై మీరేలేది సేయుమన్న నదిజేసెదను. ఇందుకేమి సందేహములేదు. యాభగవంతుడేసాక్షి।

తా ర కు మా రు డు.

వ॥ సరి నీవీయగ్నిలో ప్రవేశించిన నామదిసందియంబు బాయును విన్నావా॥

గి రి జా వ తి.

వ॥ మంచిది అట్టులనె జేసెదను మీరొక చితిపేర్చించుడు.

తా ర కు మా రు డు.

వ॥ నారీ? ఇదే చితిపేర్చించినాడ దీనిలో జొరుము.

గి రి జా వ తి.

వ॥ చిత్తము (అని యగ్నికి మూడు ప్రదక్షిణములు జేసి తనలో హే పతిపావిత్రా! పంచభూతంబులారా బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలారా! నేనీ దొంగరాక్షసుని మాయాకృత్యం బెరుంగక యాతడెట్లు జెప్పినట్లు జేసితిని ఇందుకుమీరేసాక్షి నేను కేవలము పతివ్రతనైతినేని ఈయగ్ని చల్లారుగాక అని యగ్నిలోజొచ్చి చల్లగా వెళ్ళినంత)

తా ర కు మా రు డు.

వ॥ గిరిజావతీ! ఇప్పుడుగదా నాసందియంబు బాసినది నిన్ను గ్రహించెదను రమ్ము॥

గి రి జా ప తి.

వ॥ మహా ప్రసాదము (అని అనుసంత)

తాతకుమారుడను శివకుమారునితో.

వ॥ నాయనా! శివకుమారా! నీవెంతభాగ్యశాలివి నీధర్మమే నిన్నుగాపాడినది. నీకీ నలుగురు భార్యలు లభించిరి. వీరియుక్తముగా ఈదివ్యయాత్ర పుష్పకంబులపై నెకి - మనదేశము మనముపోదాముపమ్మా

శి వ కు మా రు డు.

వ॥ మంచిది జనకా ఆలాగే పోదముపమ్మా (అని ధర్మరాజు పట్టణమున కేగుచున్నంత)

నా ర దు డు ప్ర వే శిం చి.

వ॥ శివకుమారా నీబల మాలికలుంబులకే నెంతో సంతోషించితిని. గాని యిచ్చటికి యోజనము పెట్టున గౌతమ మహాముని యాశ్రమ మున్నది అందులో రెండు వ్యాఘ్రములు సమస్తమైన ప్రజలను పీడించుచున్నవి. కావున వాటిం దునిమి నీకీర్తి దశదిశల ప్రకాశింప జేయుమి పొమ్మా. నికిదియే శలవు. నేబోయెదను.

శి వ కు మా రు డు.

వ॥ చిత్తము స్వామీ (అని పద్మావతితో) పద్మావతీ వింటివా వింటివా యీ నారదమహర్షి వాక్యంబులు ఈ గౌతమాశ్రమంబున రెండుపులులున్నవట నరులబాధించుచున్నవట. వాటింద్రుంచుటకై నేవెళ్లెదను శలవొసంగుము.

ప ద్మా వ తి.

వ॥ మంచిది మనోహరా పోయిరమ్మా. పరోపకారమే పరమ ధర్మముగదా కావున యప్పులులం ద్రుంచి ప్రజలబాధ నివారింపుము॥

శి వ కు మా రు డు.

వ॥ ఇదో నేబోయెదను (అని పులులసమీపించి) అబ్బా యీపులులెంతమదోన్మత్తులై చరించుచున్నవి వీటింద్రుంచెదగాక (అని బాణ మెకుబెట్టి వేసినంత పులులరూపంబుమాని యిద్దరు రాక్షసులై నా కెదుర నిలచియున్నారుగదా మంచిది వీరినిక్రూరా ద్రుంచెదగాక

(అని రాక్షసులతో) ఒరే; రాక్షసులారా మీమనోన్మత్తంబేమన వచ్చును. మిమ్ములమర్దించక మానను రండు. నాతో సమరంబున నిల్వుడు.

రా క్ష సు లు.

వ॥ ఒరే! నరాధమా మమ్ముజయించక నీవశంబుగాక. పారిపొమ్ము. లేకయున్న బ్రతుకజాలవు.

వాదము—యేకతాళము.

శివ॥ రారాదైతే యాధములార ఐమ్మిమ్మిచటనుమారణముకొందించియు మరిబంపుకు యమపురికి ॥రారా॥

వ॥ ఒరేరాక్షసాధములారా మీమాయకారితనంబు నాకుంజెలిసినది. మొదలు వ్యాఘ్రాకారంబును వచ్చి తరువది రాక్షసులై యాభీకరాకారంబులను వచ్చినభయంబు నొందుటవా నుగాను రారండు మిమ్మిచ్చట మర్దించి యమపురంబున కంపెదను॥

రా॥ లోరిమానవాధమ మీరిపల్కబోకుర। కారణముచేత నీకరణీమేమైతిమి॥ ॥వో॥౨॥

వ। ఒరే! నరాధమా యాగౌతమమహాముని శాపంబునవ్యాఘ్రరూపంబులుం బొంది యింతపర్యంతరము చరియించి నీబాణంబునవ్యాఘ్రరూపంబులు మాని మానిజరూపంబులుం బొందితిమి యిట్టిమమ్ములంజయించ నీవశంబుగాదు పారిపొమ్ము॥

శివ॥ నిక్కిమెదిరించిబల్ మిక్కిలిగబల్కకుడి। పెక్కుబాణముల నుక్కడంతు వినువక ॥నిక్కి॥

వ। ఒరే! రాక్షసులారా! ఇదే మీపై శరవరంపరలు ప్రయోగించి మీప్రాణంబు లపహరించెదను చూడు చూడుడు. నా ప్రతాపం బింతియె కాదు॥

రా॥ యెక్కువలు బల్కకుర యేమి మానీతోడను మక్కువతో పెద్ద మెట్టు పల్లిశుడె బోధించుమను ॥యెక్కు॥౪॥

వ॥ ఒరే! దేవతల్లనైననోడించు శక్తిగల మాముందర నరమాత్రుండ

వగు నీవనసెంత నేటికిమాశాపంబుబాసి నిజరూపంబులనుంటిమి యిప్పుడుసాయంకాలమైనది మేముమేతకై వెళ్లవలయును పురుషార్థి వేని రేపురావలెన్ను యుద్ధముచేయుదము (అని వెళ్ళుదురు.)

శివ కుమారుడు

వ॥ మంచిది! (అని తనలో) యీరాక్షసవేళలో వీరినిజయించ నెవరితరంబుగాదు మహామాయావులుగదా రేపేవచ్చి వీరినిమర్దించెదగాక (అని వెళ్ళిపద్మావతితో) పద్మావతీ ఇటువినుము.

పద్మావతి.

వ॥ మనోహరా! యేమివిచారము.

శివ కుమారుడు.

వ॥ విచారమేమున్నది! నేనివ్వ్యాఘ్రములజంపగనే రాక్షసులై నాతో యుద్ధముచేసి నేడుసాయంకాలమైనది రేపురమ్మనిచెప్పి వారు మేతకైవెళ్ళినారుగదా అయినా వారింజయించ మహాకష్టముగానేయున్నది(

పద్మావతి

వ॥ అవును! యీమాటనిజమేకాని.

ఉ॥ పుట్టినమహాత్ములైనమరి పుట్టినపాదులకైనగాని మే । పుట్టినవే
ళలందయిన నెవ్వరిచే మరణంబులేనిబల్ గట్టివరంబులిమ్మనిన గాక
నియిచ్చె విరించియిప్పుడా । పట్టనబట్టనొక్కటియు మానవుచే
డెగ రంచునిమ్మనన్॥

వ॥ కావున! యీప్రపంచంబున నెవ్వరిచే జావనివరం హో రాక్షసులకున్నది కాని వరమిచ్చుకాలమందు మానవులచేజచ్చెదరని బ్రహ్మవాక్యంబుగలదు అందుచే రేపటియుద్ధంబున నారదుండిచ్చిన బాణంబులుప్రయోగించుము. ప్రయోగించినవారు జత్తురు.

శివ కుమారుడు.

వ॥ మంచిది! ఆలాగేచేసెదను (అని నిష్క్రమించిమరునాడు) నేటియుద్ధంబున యీరాక్షసులంద్రుంచ వెళ్లెదగాక (అని రాక్షసులంజేరి) ఒరే! రాక్షసులారా నేటియుద్ధంబున మీప్రాణములుదక్కవు బాగావిచారించుకొనుడు.

రా క్ష సు లు.

వ॥ ఒరే! నరాధమా నిన్న నేమమ్మోజయించవైతివి మళ్ళి నేడు నీతో నేమాను పురుషార్ధివేనిరమ్మా మాతో సమరంబు జేయుము.

శివ కుమారుడు.

పాదప వృత్తము.

రాక్షసులారా సురక్షితులైమీ రీక్షణమేగుడియోగకయున్నన్.
ఆక్షయమైన శరావళిచేతన్ యాక్షితిమిమ్మువధింతు రయమ్మున్.

రా క్ష సు లు.

పాదప వృత్తము.

అక్షయమైనశరాళితొ నేమా దక్షతనీబలదంభము నేమా నీక్షణమే
గుము యింటికి జేరన్ తక్షణిమంకన జేతుమ్॥

శివ కుమారుడు. (తనలో)

వ॥ ఇట్లుగాద! నారదదత్తంబగు దివ్యబాణంబున వీరింజంపెదగాక (అని ప్రకారముగా) ఒరే రాక్షసులారా! ఇదేదివ్యబాణంబు వచ్చుచున్నది కాచుకొనుడు (అని దివ్యబాణంబున వారింజంపి) (తనలో) మంచిది యీరాక్షసులుజన్మించిరి మావారింగలియబోవెదగాక (అని పోయి పద్మావతితో) పద్మావతి నేనారాక్షసులజంపి వచ్చితివి ఇకయింకుండనేల మజ్జన నీజనకులసహితముగా మనమైనగర మీపుష్పకంబుపై నెక్కి మనపట్టణము మనముపోదముపమ్మా॥

ప ద్మా వ తి.

వ॥ మంచిది! అటులనేపోదాముపదుండు (అని పోవుచున్నంత)

తాత కుమారుడు శివ కుమారునితో

వ॥ నాయనా! శివకుమారా॥ ఇదియే మనపట్టణముజేరితిమి యీపట్టణ సమీపమందుండబడు వనాంతరంబిదియే యీవంబులోనే కదా మాతండ్రియగు ధర్మరాజు ద్రవ్వించిననూతి యదో చూడుము యచ్చటున్నది యందు విడిదిజేతముపమ్మ.

శివ కుమారుడు.

వ॥ మంచిది! (అని బావిని సమీపించిచూచి) జనకా యీబావిలో యుదకంబులేదుగదా.

తాత కుమారుడు.

వ॥ అయ్యో! కుమారా ఇంతుచేత నేగదా నుమ్మీ బావికి బలి హారమివ్వ మాతండ్రి దలంచినందున మేమిద్దరము భార్యాభర్తలము తప్పించుకొనిపోయి యున్నందున యీతజరిగినది యిప్పుడీబావిలో యుదకంబుబడిన బాగుండునుగదా.

శివ కుమారుడు.

వ॥ మంచిది (అని పద్మావతితో) పద్మావతీ వింటివా మజ్జనకునివాక్యం బులు యీబావిమూలంబుననే యింతకథజరిగినదట ఇకయీకూప మేలో నుదకంబు బడుయుపాయంబేమో యూహించివినజేయుము.

పద్మావతి

వ॥ యుపాయంబేమున్నది ఇదివరకు నీకిచ్చిన యేడురాళ్ళలో ఆరువ ప్రయమైనవి తక్కిన రాయిని యీబావిలోనుండి గంగనుప్రయోగిం చుము ప్రయోగించిన సంపూర్ణజల జలమూరును.

శివ కుమారుడు.

వ॥ మంచిది! అటులనే ప్రయోగించెదను (అని యట్లుజేసిన జలమూరినంత

తాత కుమారుడుచూచి (తనలో)

వ॥ ఆహా! ఇది యేమియాశ్చర్యము యీనిర్జలకూప మొక్కని మిషంబులో జలపూరితంబై ప్రవహించెనుగదా ఇదంత నాకుమారుని మహిమాతిశయమే (అని ప్రకాశముగా) శివ కుమారా నాయనా యిచ్చటివార్తా మీతాతయగు ధర్మరాజునకు దెలియుటకై యొకసేవ కునంపి యీతనినిందు రాజేసిన బాగుండునుగదా.

శివ కుమారుడు.

వ॥ మంచిది! అటులనే సేయుము.

తాత కుమారుడు సేవకుని కో.

వ॥ సేవకా! ఇటురమ్ము

సేవకుడు ప్రవేశించి

వ॥ ప్రభో! యేమియాజ్ఞ.

తాత కుమారుడు.

ఉ॥ సేవకనీవుబోయి కడుశీఘ్రము చెప్పుము ధర్మరాజుతో । తావెకే
నంననుండు తనధర్మసుపత్నితో తత్కుమారభా । ర్యావళితోడ
వచ్చియు వనాంతరమందున నున్నవాడటం । బీవిధమంతి చెప్పితన
విందునురమ్మను నాడుమాటగాక.

వ॥ సేవకా! నీవిప్పుడే ధర్మరాజువద్దికింజని నీతుమారుండగు తాతకు
మారుండు తనభార్యా పుత్రికోడండ్రతోవచ్చి మనయుద్యానవ
నంబులోనుండ నిన్నురమ్మని నన్నుబుత్తెంచినాడని చెప్పి యీతనిం
దోడ్కొనిరమ్మని పొమ్మని నీకిదె యాదేశలవు.

సేవకుడు.

వ॥ చిత్తము (అని ధర్మరాజుజేవ) దొరా! ధర్మరాజా నమస్కరించెదను
మీ కుమారుండగు తాతకుమారుని తంపున వచ్చిన సేవకుండను॥

ధర్మరాజు.

వ! సేవకా! యేమి సమాచారము.

సేవకుడు.

వ॥ మీకుమారుండగు తాతకుమారుండు పత్నీపుత్రి సపరివారముగా
వచ్చి యుద్యానవనమందుండి మిమ్ములరమ్మని యాజ్ఞాపించినదు
పోదము పదుండు॥

ధర్మరాజు (తనలో)

వ॥ యేమి నాకుమారుం డెక్కడ వచ్చుటెక్కడ యిన్నిదినంబులనుండి
లేని కుమారుం డిప్పుడు వచ్చెనా యైతే కావచ్చును పోయిచూచె
దను (అని కుమారుం జేరియున్నంత॥

తాతకుమారుడు.

వ॥ జనకా నమస్కరించెదను.

ధర్మరాజు.

ప॥ ఆహాహా తాతకుమారా వర్ధిల్లుము వర్ధిల్లుము యెన్నాళ్ళకెన్నాళ్ళ
నిన్నుజూచితిరా తండ్రీ వీరంత యెవరు॥

తా త కు మా రు డు.

వ॥ జనకా చెప్పెద నిటువినుము॥

వాదము—జుల్వాతాళము.

తా॥ జనకా వినుమతడు నీమనుమడును శివకుమారుడు । అనఘుండితని సుపత్నిమణులీనలుగురును చూడు ॥జన॥౧॥

వ॥ తండ్రీ యీతండు మనుమడగు శివకుమారుండు యీనల్గురు పద్మావతి, నీలావతీ, చంద్రావతి, పుణ్యావతులను వారు యీతనిభార్యలు ఈసేనా పరివార మంత్రీతనిదే యీతడు జేయగనే మేము సురక్షితులమై యిల్లుజేరితిమి॥

ధర్మ॥ తనయా ఈతనిమహాత్వమును యేమని పొగడుదింక ॥తన॥ అని మిషు సరియనగవచ్చు ననఘుకు ధర్మాత్ముడింక ॥తన॥౨॥

వ॥ కుమారా ఈతని ప్రభావంబు జూడదేవసముడనే యెన్నబడును. యేముకాంతి యేమిశాంతి (అని శివకుమారునితో) మనుమడా। శివకుమారా ఇటురమ్ము. మద్వంశోద్ధారకుండవగు నిన్నెన్నవశమా॥

శివ॥ మీరేలనన్ను ఈతరిపొంపిజేయ॥ చేతోముదమునన వాశీర్వాదము బునిదియ ॥తాతా॥౩॥

వ॥ తాతా ఇదంత మీయాశీర్వాద బలంబేకాని వేరొండుగాదు నన్నింపు జేసెదరెందుకు యదోచూడుడు మీరుద్రవ్వించిన బావిలో యుదకము సంపూర్ణముగా నిండియున్నవి (అని జూపినం జూచి)

ధర॥ యేతీరున బడియెనిట్టు నూతిలోన జలమునిపుడు। ఖ్యాతిగ వినిపించు మీవునాతో విశదముగనేడు ॥యేతీ॥౪॥

వ॥ శివకుమారా ఈనూతిలో జలంబు జొరదమిన విధానంబేమా నిజంబుగ జెప్పుము ఇదియొక చిత్రంబుగా నుండెనుగదా॥

శివ॥ సరె ఈవిధమంత దేవరుసుత పద్మావతిచే । మరి వినగోరుడు తెల్పును విరివిగ సమ్మోదముచే ॥సరె॥౫॥

వ। తాతా ఈనూతిలో జలంబూరిన చందం బీదేవేంద్రుని కుమార్తెయగు పద్మావతి నడుగుడు చెప్పగలదు॥

ధర్మ॥ శ్రీపెదమెట్టుపల్లి ధాముని సత్కరుణచేత। నెరిగెద ఈపద్మావతి పాపసమధ వ్యాప్తతులచేత ॥ధర॥౬॥

వ॥ శివకుమారా అట్టులనే. ఈపద్మావతి నడిగి తెలిసికొనియెదగాక (అని పద్మావతితో) తల్లీ పద్మావతీ ఈనూతిలో జలంబుబడ్డ విధానం బెట్టులో చెప్పుము॥

పద్మావతి.

వ॥ తాతా ధర్మరాజా ఈబావిలో ఆదిశక్తియుండి బలిహార మడిగినది మీరివ్వనందున ఇంతకథజరిగినది ఇప్పుడా యాదిశక్తి రాక్షస రూపంబున నాకుమారుండగు తాతకుమారుని మింగినందున ఈనూతిలో జలంబూరినవి విన్నానా॥

ధర్మరాజు.

వ। ఆహాహా తల్లీ పద్మావతీ ఇప్పుడుగదా నామదికోరంతలెల్ల బాసినది (అని తాతకుమారునితో) తాతకుమారా। మనమందర మిప్పుడౌనిజగృహంబున కేగుదము రండు.

తాతకుమారుడు.

వ॥ చిత్తము అట్టులనే పోదము పదుండు ( అని నిజ గృహంబుం జేరి యున్నంత)

సుజ్ఞాన మూర్తివచ్చి ధర్మరాజుతో-

వ॥ ధర్మరాజా ఇటొకసారి నామనవి వినుము.

ధర్మరాజు.

వ॥ గురువర్యా సుజ్ఞానమూర్తి యేమిమనవి.

సుజ్ఞానమూర్తి.

వ॥ శ్రీబసవేశ్వరుండు । శ్రీశైలమునుండివచ్చి । మనయుద్యానవనములోదిగి । మీరుదర్శించిన బావిలోయుదకముండుటముజూచి। చాలాసంతోషించి మిమ్మందర నాశీర్వదించి మల్లికల్యాణ పట్టణంబునకు వేంచేసెనుగదా.

ధర్మరాజు.

వ॥ మంచిది వారియాశీర్వాదమే మనకుక్షేమము గాని దేనీరాజ్యభార మీ తాతకుమారునకు వహింపజేసి తపోవనంబునకేగెదను॥

సుజ్ఞాన మూర్తి.

వ॥ సరి అటులనే సేయుము.

ధర్మరాజు - తాతకుమారునితో.

వ॥ నాయనా తాతకుమారా! నీవీరాజ్యాభిషిక్తుడవుగమ్ము నేనా తపోవనంబున కేగెదను.

తాతకుమారుడు.

వ॥ చిత్తము తండ్రి (అనినంత తాతకుమారునకు బట్టముగట్టి ధర్మరాజు తపోవనంబున కేగినంత)

వ॥ తనయూ శివకుమారా! కొంత కాలము నేనీరాజ్యమేలితిని కావున యిప్పుడు నీవుపట్టాభిషిక్తుండవై ధర్మంబుదప్పక రాజ్యప్రతి పాలనంబు సేయుము నేనా తపోవనంబున కేగి శివునింగూర్చి తపంబు జేసి మోక్షంబు సంపాదించి కొనియెదను.

శివకుమారుడు.

వ॥ చిత్తము తండ్రి మీయాజ్ఞ మెలంగెదను.

తాతకుమారుడు.

వ॥ నీవీ సింహాసనంబుపై కూర్చుండుము.

శివకుమారుడు.

వ॥ సరి అటులనే కూర్చుండెదను (అని కూర్చుండును)

—♦ శివకుమారుని పట్టాభిషేక ♦—
మహోత్సవము.

క॥ జయమును జయమును జయమును ॥ జయమయ్యె శివకుమార చాల గనీవుక్ । రయమున నీవీరాజ్యము । ప్రియమున పాలింపుచుండు ప్రేమదలిర్పన్॥

శివకుమారుడు.

వ॥ హా జననీ జనకులారా! నమస్కరించెదను.

తాతకుమారుడు.

వ॥ కుమారా వర్ధిల్లుము వర్ధిల్లుము॥

సంధివ! ఇట్లు శివకుమారునికి బట్టముగట్టి తాతకుమారుడు తపోవనంబున కేగినంత శివకుమారుడు ధర్మంబుదప్పక రాజ్యప్రతి పాలనంబు సేయుచు నలుగురు భార్యలసమేతముగా సర్వసౌఖ్యంబులను భవింపుచు సుఖంబుగ నుండెనంత.

మంగళహారతి—దర్వు—ఆటతాళము.

మంగళము రాజేశ్వరస్వామి! మహాదేవ శ్రీశుభ! మంగళము వేదాంత స్తుతిగామి ॥మంగ॥

లింగసంభవ భంగసజ్జన సంగవృషభ తురంగ సురముని పుంగవస్తుత లింగికేశ భుజంగ భూమసితాంగ జయజయ ॥ మంగ ॥ ౧ ॥

దక్షముఖ విధ్వంస కాబ్జధరా! పరమేశ్వర విరూపాక్ష పరమపదేశ గంగధరా ॥దక్ష॥

అక్షయసు ప్రత్యక్ష ఫలదకటాక్షతిరి జగదీశసమి దాక్షభూషమ ముక్షుజనఘన మోక్షదాయక త్ర్యక్ష జయ జయ ॥మంగ॥౨॥

ధారుణీరథ చంద్రదవి చక్రా! దైత్యారి శరబృం! దారకాచల చాప నిర్వక్రా ॥ధారు॥

నీరజోద్భవ సారధిశ్రుతి వారువాళి సమీరభుక్పతి! నారి విలసన్నీరనిధి తూణీ రఘున త్రిపురారి జయజయ ॥మంగ॥ ౩॥

అగజహృత్సరసీరుహాళి శివా! అమరేంద్ర వినుత శ్రీ! జగతిపై వమెట్టు పల్లిధవా ॥అగ॥

నిగమనుత భూతగళవల్లభ సగుణ నిర్గుణ జగదవల్లబ! నగశయనమిత్ర గణపతి గురుభగవఘు సంవిగత జయజయ ॥మంగ॥ర॥

క॥ ధరణిన్ విరోధి సంవత్సరమున ♦
శ్రీ జ్యేష్ఠ శుద్ధ దశమి సుదిన మం ♦
దరయుగ యీనాటకమును విరచించితి ♦
గిరికరుణ విలసద్భక్తిన్ ॥

## గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర చరణారవింద మకరందపానానందేందిందిరాయ
మాన మానసుండును వ్యాఘ్రపాదాన్వయ సాగరామృతకరుండును
వీరశైవ మతోద్భవుండును సిద్ధరామయ్య ప్రియశిష్యుండును
చెన్నవీరయ్య పౌత్రుండును నాగయాఖ్యలింగమాంబాగర్భ
సంభవుండునగు గంగాధరాఖ్య కవి వర్యునిచే రచి
యింపంబడిన శివకుమార నాటకము

సంపూర్ణము.

సర్వము

శ్రీ శివార్పణమస్తు.



# మంగళహారతులు.

## ఏకతాళము.

౧. మంగళం మంగళం మహాదేవహరా। సంగర విజితానంగ మద హరా ॥మంగ॥ ఇన చంద్రానల యుతనయన భవా। ననరు మహాబ్ధి నిరుపమ విభవా ॥ మంగ ॥ ౨ ॥ చల్లని పెదమెట్టుపల్లి నివేశా। ముల్లోకాధిప ముక్కంటీశా ॥ మంగ ॥ ౩ ॥ భువి శ్రీ కథలాపురివాస సదా। కవిగంగాధర కామితఫలదా ॥ మంగ॥౪॥

౨. జలజాతఘ్నకిరీట సదాశివ జయమంగళ మిహతే। నలినోద్భవ సన్నుత భూషణ పన్నగరాట్టు గుణాహితే ॥జల॥౧॥ పావకాక్ష మృత్యుంజయ సాత్త్వోత్పర బ్రహ్మరూపా। రావణమదగర్వాపహా త్రిజగజ్జీవ విధుకలాపా ॥జల॥౨॥ ఖండపరశు సచ్చిదానంద మార్తాండకోటి తేజా। అండపిండ బ్రహ్మాండ భరిత విశ్వార్చితాంఘ్రి వనజా ॥జల॥౩॥ ధరణి పెద్దమెట్టుపల్లి మందిరహారనుత స్వయంపా పరమశ్రీ బసవంతుల సద్వర దాయక శంభో ॥ జల ॥ ౪ ॥

నింగికేళ కథలపౌరి మందిర నిరుపమానవేషా । శృంగారార్ణవ
సూరివినుత కవిగంగాధరపోషా ॥జల॥౫॥

జంపె తాళము.

౩. మంగళములు మంగళములు మంగళ మిహాతే । గంగాధర కనక
శైల కార్ముక భవతే ॥మంగ॥౧॥ నీలకంఠ నిగమవినుత నిత్య
వైభవా। ఫాలనేత్ర పరమపురుష పార్వతీధవా ।మంగ॥౨॥లాలిత
పెదమెట్టుపల్లి యాలయానసదా। శీలమంతుల భక్తియ వాంఛిత
ఫలప్రదా ॥మంగ॥౩॥ భాసుర శ్రీకథలాపురివాస సుఖేలా । వా
దానుత గంగాధర వరకవిపాలా ।మంగ॥౪॥

జుల్వ తాళము.

౪ మంగళమిహాతే సదాశివా । మహాదేవ సర్వ । మంగళ హృద
యాబ్జసంస్థవా ॥మంగ॥ రంగదమల భృంగకంఠసంగరరిపు భంగ
సుజన । సందవృషతురంగఖ గతురంగళరసితాంగక జయ॥మం॥
౧॥ ఖండకుముదసఖ కిరీటకా । కమలాస్త్రమడవి । ఖండననుత
హంసఘోటకో ॥ఖండ॥ కుండలిపతి మండనభవదండన రిపుఖం
డన జయ । భండన శివఖండ పరశుమండిత గుణమండల జయ॥
మంగ॥౨॥ తపన చంద్రవహ్నిలోచనా । తపసీయశైల । విపుల
నావచరితమోచనా ॥తప॥ అపరిమిత గుణపయోనిధి త్రిపుర
దహన కపటదమన । చపలమానసపరిహర కృపణాశుంతయ వ
హారజయ ॥మంగ॥౩॥ ధాత్రిపెదమెట్టుపురి గృహాసదా । వరశీల
మంతుల భక్తయేప్సితార్థసు ఫలదా ॥ధాత్రి॥ మిత్రహరిపవిత్ర
హృదయపాత్ర రజితగోత్ర నిలయ । వృత్రదనుజ జైత్రముఖర
స్తోత్రధనదమిత్రమ జయ॥మంగ॥౪॥ ధరణికథలపురి విహారకా ।
గంగాధరస । ద్వరకపీంద్రజన్మతారకా॥ ధర। పరమపురుష శిరి
శసతోద్ధరణ హరణపాపశుభా ॥ భరణమాని సర్మణచరణకరుగ
గుణోత్తరణక జయ॥ మంగ॥౫॥

యేక తాళము.

౫. ఓంకార రూపమంగళంబిదో సంకటాపహరణ నీలకంఠా ॥ఓం॥
పంకజారిమిత్ర వహ్నిలోచన పాపమోచనాంత కాంతకారిభ

యంక రాబ్ధికరుణ భక్తలోకవశంకరాందకారి దీనబంధో॥ఓంకా॥
౧॥ సవనభంగవి విధలోకపాలన ధవళవర్ణకువయూత్రభంజన ।
పరివిమలాంతరంగ మానిపోషన రవినహస్రకోటితేజ శంకర॥
ఓంకా॥౨॥ ధాత్రిపెద్దమెట్టుపల్లి మందిర గోత్రితనయ నాథశీ
మంతుల । ఛత్రియేప్సితార్థదాయక బుధస్తోత్రశూల పాణిప
మధ నాయక ॥ఓంకా॥౩॥ చారుకధలపౌరి మందిరేశ్వరనారదా
మానివినుత ఘనశ్యాం। గారవార్ధి బాలచంద్రధర గంగారరాశి
కవివరేణ్యపోషన ॥ఓంకార॥౪॥ ఆట తాళము.

మంగళము మహాదేవ శ్రీశంభో ॥ మహిత పరిభావసి తాంగయు
శాంత వినుత స్వయంభో ॥మం॥ నింగికేశపతంగ చంద్రరథాంగి
నిగమతురంగభూమిశ । తాంవతార్థ తురంగశరభస్వాంగ త్రిపుర
విభంగ జయ జయ॥మంని॥౧॥ వాసవాది యిరప్రణుతపాదా ।భ
వనైద్య శ్రీశుక । వ్యాసనారదముని నుతవినోదా॥వాస॥ దోషర
హితద యాసముద్రమదాసు రఘునివాస రజితగి । రీసురార్శి
తవాసుదేవ సఖాసమన్వితవేస జయజయ॥మంగ॥౨॥ క్రతువిభం
జన ఫాలనేత్రిశివా । కమనీయజయసం । తతవిలాసమహాత్మ
గాదివా ॥క్రతు॥ వితతబాహుబలతతి విక్రమకుతుక చిత్తముని
తతినన్నుత నతజనోద్ధరమిత వచనదుమృత విగతసంతత విజయ
జయ ॥మంగ॥౩॥ శీలపెదమెటుపల్లి వాసనదా । శ్రితలోకపాలక
శీలమంతుల ఛత్రియేష్టప్రదా ॥శీల॥ నీలలోహిత ఫాలనేత్రివిశా
లకృ కృపాలవాలపి । పలికాదిమరాళ గాంతరజాల మయమృగ
శూలిజయజయ ॥మంగ॥ ౪॥ చారుశ్రీమత్కథలపురివాసా ॥గం
గాదరకవి। స్ఫూరితమనోభీష్టద విలాసా॥చారు॥ నారదస్తుతఘో
రదుమృతభూరికానన దారుణాగ్ని ప । టీరవిధుడిండీరహంసతు
షారతుల్య శరీర జయజయ॥మంగ॥౫॥ ఏక తాళము.

సాంబజయమంగళారతీ । శివసాంబాశుభమంగళారతి ॥సాంబా।
సాంబాసుగుణకదంబా । శ్రీజగదంబా । వరమోహకదంబా శ్రీ
శివ ॥సాంబా॥౧। దేవాదేవాదిదేవా శ్రీమహాదేవా । సురముని
జీవా శ్రీశివ ॥సాంబా॥౨॥ పూర్వా! మరమదగర్వా । పహాణ

సుపర్వా శ్రీశివ ॥సాంబా॥౩॥ వేల్పుమతల్లీ! పెదమెటుపల్లీ। ధవకృపవల్లీ శ్రీశివ ॥సాంబా॥౪॥ శీలా।శీలమంతులా। ఛత్రయపాలా।కరిచర్మచేలా శ్రీశివ ॥సాంబా॥౫॥ భూరి శ్రీ కథలపూరి వరగంగాధర కవిహృద్విహారి శ్రీశివ ॥సాంబా॥౬॥

ఏ క తా ళం.

౮. ఫాలలోచనా మంగళమిదో గొను హే। పాపమోచనా నీలకంఠ కరుణాలవాలగుణ శీలభక్తహృల్లోలా దయానిధే ॥ ఫాల ॥ ౧ ॥ పండితావనా। పరమేశ్వర పరమాఖండజీవనా। ఖండపరశు మార్కండేయావన। దండిదండి బ్రహ్మేంద్రోదర హే ॥ఫాల॥౨॥ కంతుసంహారా। పెదమెటుపల్లియ। శాంతమందిరా। సంతత శీలమంతుల ఛత్రయ। చింతిత ఫలవిశ్రాంతి పద హే ॥ఫాల॥౩॥ నీలలోహితా। కథలపురీశ్వర దే। వాదిసేవితా। కాలకూట గదకవి గంగాధర। పాలిత ప్రదమోన్మీలిత రవ హే ॥ఫాలలో॥౪॥

ఏ క తా ళ ము.

౯. చంద్రశేఖరా। మంగళ మందరి శ్రీకరా ॥ చంద్ర ॥ సాంద్రకీర్తి భక్తలోకపాల మునీంద్ర హృదయలోల దీనపోష గి। రీంద్ర జాత హృదయపద్మ భృంగబుధేంద్ర వినతపాదపద్మ యుగ శ్రీ ॥చంద్ర॥ ౧॥ యావదాత్మకా। త్రిజగ। జీవపోషకా॥యావ॥ వామదేవ విలద్భావభావకారి కేశవప్రియ। పావనాత్మ పావకేక్షణ మహాదేవకోవిదార్చితాంఘ్రియుగశ్రీ ॥ చంద్ర ॥౨॥ భూతనాయకా। భార్గవి। నేతసాయకా ॥ భూత ॥ ఖ్యాతియు పెద్దమెట్టుపల్లి నికేతనార్క కోటితేజ కృశానునే। తశీల మంతుల ఛత్రయ ప్రస్ఫుత వాంఛితార్థప్రదశివశ్రీ ॥ చంద్ర ॥౩॥ చారు సుందరా। కథలాపురి మందిరా ॥చారు॥ కారుణి కధురాధరేశ కవి గంగాధరాఖ్య పోషనీలకంధర। మేరుచాప పాపమోచన మహాధీర కృత్తివాస ధూర్జటీశ్రీ ॥చంద్ర॥౪॥

ఆటతాళము.

౧౦. మఖవిధ్వంసక మంగళమిదో। బ్రహ్మముఖరవందిత మంగళమిదో మఖ॥ అఖిలరూప దయాసముద్రియ నంతకోటి యజాండనా

యక సుఖకరాత్మవసుంధర ధరసుత మనోహరమిత వచన హే॥ మఖ॥౧॥ సూరవందిత పాదయుగదా। సద్బృందార్చిత నీలసుగళా॥ సూ॥ వారణత్వక్చేల మునిమందార ప్రమథగణేశ రుద్రిన। మార భ క్షతి కంకణమహోదారమూర్తి ప్రమోదవర్తీ॥మఖ॥౨॥ విశ్వ వ్యాపక పావనాత్మా। నిత్యవివ్వారాధిత పరమాత్మా। విశ్వ। శాశ్వతైశ్వర్య ప్రదమహో త్ర్యశ్వత్రి జగద్రక్షకమహా। విశ్వ రూప విరూపనేత్ర మహేశ్వరాంధక వైరి శివహా॥మఖ॥౩॥ ధర ణీ శ్రీపెదమోట్టుపల్లీ! వాసపరమ కృపాపాలవెల్లీ॥ధర॥ సరసమృ దువచశీల మంతుఁ ధాత్రయ మనోభీష్టద మహా। గరళకంఠ పినాకపాణి స్ఫురదలంకృత యత్నసరహె॥మఖ।౪॥ క్షితి శ్రీప తంఠధలాపురీశా। భక్తతతి బృందారకదుమ మహేశా॥ క్షితి సతతకవి గంగాధర సురక్షిత నిరంతర శాశ్వతైశ్వ। ర్యతతిభలద ము ముక్తిమోక్షద పతితపావన గతకలుష హె॥మఖ॥౫॥

గ ద్య ము.

ఇది శ్రీపరమేశ్వర చరణారవింద మకరంద పానానందేందిందిరాయమాన సన్మానసుండును వ్యాఘ్రముకాంతాన్వయ సాగరామృత కరుండును వీరశైవ మతోద్భవుండును సిద్ధరామయ్య ప్రియశిష్యుండును నాగయాఖ్య లింగమాంబాగర్భ ప్రభవుండును నగు గంగాధరాఖ్య కవి [illegible] రచియింపంబడిన శివపర మంగళహారతుల శతకము సంపూర్ణము.

[illegible]ర్వ ము.

[illegible]వార్పణమస్తు.